# షోడశ సంస్కారములు

(అపరకర్మలు, పితృయజ్ఞము - పరిచయము)

## తప్పనిసరిగా తెలుసుకోవలసిన కొన్ని ముఖ్యవిషయాలు


1. గర్భాధానము


2. పుంసవనము


3. సీమంతోన్నయనము


4. జాతకర్మ


5. నామకరణము


6. అన్నప్రాశనము


7. చౌలము


8. ఉపనయనము


9. ప్రాజాపత్య వ్రతము


10. సౌమ్య వ్రతము


11. ఆగ్నేయ వ్రతము


12. వైశ్వదేవ వ్రతము


13. గోదాన వ్రతము (కేశాంతము)


14. స్నాతక వ్రతము (సమావర్తనము)


15. వివాహము


16. అంత్యేష్టి




వేద సంస్కృతి పరిషత్ - హైదరాబాద్

# ఉమ్మడి నల్గొండ జిల్లాలోని .... మా ఆరాధ్య దైవాలు



శ్రీ ఉమామహేశ్వరస్వామి, జువ్విగూడెం



శ్రీ హరిహర త్రిశక్తి క్షేత్రం, శ్రీవిద్యాపురం, వలిగొండ



శ్రీ గోదా పద్మావతీసమేత
సాలగ్రామ వేంకటేశ్వరస్వామి, అక్కినేపల్లి



శ్రీ భక్తాంజనేయస్వామి, అక్కినేపల్లి

# షోడశ సంస్కారములు

**(అపరకర్మలు, పితృయజ్ఞము - పరిచయము)**

సంకలనం

**జాలా సోమనాథ శాస్త్రి**

**వేద సంస్కృతి పరిషత్**

వైదిక సాంస్కృతిక ఉద్దీపన పరిశోధనా సంస్థ

2-2-1109/బికె-ఎల్ఐజి 10, బతుకమ్మకుంట

బాగ్అంబర్‌పేట, హైదరాబాద్ - 500013

# షోడశ సంస్కారములు

## (అపరకర్మలు, పితృయజ్ఞము - పరిచయము)

సంకలనం : జాలా సోమనాథ శాస్త్రి

**SHODASA SAMSKARAMULU**

***(Aparakarmalu, Pitru Yagnamu : Parichayamu)***

Compiled by : Jala Somanatha Sastry

ప్రథమ ముద్రణ : శ్రీశోభకృతు ఫాల్గునం, మార్చి 2024

ద్వితీయ ముద్రణ : శ్రీ క్రోధి వైశాఖం, జూన్ 2024

ప్రతులకు :

**జాలా సోమనాథ శాస్త్రి,** ఫోన్ నెం. 8978313332

ముద్రణ : **మహతి ప్రింట్ క్రియేషన్స్,** అంబర్‌పేట, హైదరాబాద్

వెల : **రూ. 100/-**

# విషయసూచిక

- **మానవ జీవన పరమార్థం - పంచ మహా యజ్ఞాలు**
- **పితృ యజ్ఞము, పితృ దేవతలు - జన్యుశాస్త్ర విజ్ఞానం**
- **సృష్టి కర్త బ్రహ్మ మొదలుగా కుటుంబవ్యవస్థా క్రమము**
- **కారుణ్య వర్గ క్రమము- మరణించినవారు (పితృదేవతలు)**

  విశ్వేదేవులు - పితృదేవతల అంగ రక్షకులు,

  విశ్వేదేవులు - శ్రాద్ధములను బట్టి ప్రత్యేక బాధ్యతలు

- **'శ్రాద్ధము' - నిర్దేశిత శ్రాద్ధ కర్మలు**

  'శ్రాద్ధ కర్మ' క్రమము, శ్రాద్ధము -

  వసు, రుద్ర, ఆదిత్య రూపములు - శాస్త్రీయత

- **వేదోక్త విధానములో శ్రాద్ధములు**

  సాధారణంగా వాడుకలో వున్న శ్రాద్ధ విధానములు, శ్రాద్ధ భోక్తల సంఖ్య

- **శ్రాద్ధ ముఖ్య నియమములు**

  గృహ పరిసరములు, శ్రాద్ధములందు వుండవలసిన పిండ ప్రమాణము, శ్రాద్ధాంగ తర్పణములు, శ్రాద్ధ స్థల శుద్ధి, శ్రాద్ధ పిండ నిక్షేపణ, వికిరపిండ నిక్షేపణ, భోజన పాత్రల ఉచ్చారము, శ్రాద్ధ ఆశీర్వాద అక్షతలు.

- **పురాణోక్త విధానములో పితృ కార్యములు**
- **గయా శ్రాద్ధము - పంచ గయలు - మాతృ గయ - విశిష్టత**
- **ఆధునిక కాలములో పితృయజ్ఞ ఆచరణ ఆవశ్యకత**
- **పితృయజ్ఞము - మహాలయ పక్షము-ప్రత్యేకత**
- **మహాలయ పక్షము - నేటి కాలములో వాస్తవ ఆచరణ**

# మున్నుడి

## సంస్కారములు-పంచమహాయజ్ఞాలు-పిత్ృయజ్ఞం-కృతజ్ఞతలు

- బ్ర.శ్రీ పాలకుర్తి రామమూర్తి

**గాయంతి దేవాః కిల గీతకాని, ధన్యాస్తుతే భారత భూమి భాగే ।**
**స్వర్గాపవర్గస్పద మూర్గ భూతే భవంతి భూయాః పురుషస్సురత్వాత్ ॥**

అంటుంది విష్ణు పురాణం. స్వర్గమునకైనా అపవర్గమునకైనా అనగా మోక్షమునకైనా చక్కని మార్గదర్శనం చేసే భారత భూమిలో నివసించే మానవులు మాకన్నా ఎంతటి ధన్యులో కదా అనుకుంటూ దేవతలు భారతీయుల భాగ్యాన్ని గానం చేస్తారట.

సభ్యతా సంస్కారహీనులై ఏ నాగరికతా తెలియక పశుప్రాయులైన పాశ్చాత్య సమాజం అలమటిస్తున్న రోజులలోనే చక్కని వ్యవస్థీకృతమైన సమాజాన్ని ఆవిష్కరించి భారతదేశం నాగరికతా వెలుగులను ప్రపంచానికి పంచింది. శాస్త్ర సాంకేతిక రంగాలలోనూ వ్యాపారాది రంగాలలోనూ పరిణతి సాధించిన భారతావని తాత్త్విక, ధార్మిక సంబంధమైన అంశాలలో ఎంతో ముందున్నది. ప్రతి విషయంలోనూ స్థూల సూక్ష్మ కారణాది అంశాల మూలాలను లోతుగా విచారించి నిర్దిష్టమైన నిర్దుష్టమైన మార్గాన్ని చూపింది. తద్వారా మానవుని భౌతిక ఆధ్యాత్మిక జీవితాన్ని రసవంతంగానూ ప్రయోజనకరంగానూ ఫలవంతంగానూ తీర్చిదిద్దుకునే అవకాశాన్ని ఇచ్చింది.

వేదమే భారతీయ సనాతన జీవన ప్రవంతికి మూలాధారమైనది. అందులో జ్ఞానకాండ కర్మకాండ అనే విభాగాలు ఉన్నాయి. కర్మకాండలో ప్రతిపాదింపబడిన అర్థమునకు 'ధర్మము' అని పేరు.. అలాగే జ్ఞానకాండలో ప్రతిపాదింపబడిన అర్థమునకు 'బ్రహ్మము లేదా సత్యము' అని పేరు. ఈ కర్మకాండలో విధులు, నిషేధాలను గూర్చి బ్రాహ్మణములు చెపుతాయి. ఏది తప్పకుండా ఆచరించాలో అవి విధులు గానూ.. ఏది ఆచరించకూడదో వాటిని నిషేధాలుగానూ చెప్పారు.

**"సంస్క్రియతే జ్ఞాన యోగ్యతా మాపద్యతే, పురుషస్య చిత్త మనేనేతి సంస్కారః"** ఏది పురుషులను అనగా సకల జీవులను బ్రహ్మజ్ఞానమును పొందుటకు యోగ్యమగునట్లు సంస్కరించునో దానికి సంస్కారం అని పేరు. చిత్తశుద్ధియే సంస్కారానికి ప్రముఖ లక్షణం.

మహాత్ములైన ఋషులు తమ తపస్సులో త్రికాలలాను, త్రిలోకాలను దర్శించి ప్రతిభాన్విత మైన మార్గాన్ని చూపారు. ఏయే సంస్కారాల వల్ల మానవుడు తనను తాను ఉద్ధరించుకో గలుగుతాడు, సమాజ ఉద్ధరణకు ఏ సంస్కారాలను ఎలా వాడాలి అనే అంశాలను శాసనంగా రూపొందించారు. గృహస్థుకు విధిగా చెప్పబడినవి పంచ మహా యజ్ఞాలు. మానవులకు నిర్దేశితమైన ఇరవైనాలుగు సంస్కారాలలో ముఖ్యమైనవి పదునారు. వాటిలో భాగమైనవి పంచమహాయజ్ఞాలు.. అవి దేవయజ్ఞం, పితృయజ్ఞం, భూతయజ్ఞం, మనుష్య యజ్ఞం బ్రహ్మయజ్ఞం.

పితృ అంటేనే "తల్లిదండ్రి" అని అర్థం. **"దేవపితృకార్యాభ్యాం నప్రమదితవ్యం"** దేవ పితృ కార్యములందు అప్రమత్తుడవై ఉండాలంటుంది తైత్తిరీయోపనిషత్తులోని శిక్షావల్లి. తల్లిదండ్రులకు నిర్వహించే ఉత్తరక్రియలన్నీ యజ్ఞములే. యజ్ఞము అంటే ధర్మం కొరకు, దైవం కొరకు, పరహితం కొరకు ఆచరించే కర్మలు. దేవయజ్ఞం, భూతయజ్ఞం, పితృయజ్ఞం, బ్రహ్మయజ్ఞం, మనుష్యయజ్ఞం ఈ ఐదు యజ్ఞాలు మానవులకు కర్తవ్యాలుగా చెప్పబడ్డాయి. జ్ఞానార్జన బ్రహ్మయజ్ఞంగా, దేవతలను సంతృప్తి పరచడానికై 'స్వాహా' పూర్వకంగా సమర్పించే హవనాదులు దేవయజ్ఞంగా. పితృదేవతల తృప్తికై "స్వధా" పూర్వకంగా ఆచరించే శ్రాద్ధాదులు, అన్నదానాలు పితృయజ్ఞంగా, జీవరాసులకు పెట్టే ఆహారం భూతయజ్ఞంగా, అతిథి అభ్యాగతులకు సమర్పించే భోజనాదులు మనుష్య యజ్ఞంగా చెప్పబడ్డాయి.

తల్లిదండ్రులను, గురువులను, వంశకర్తలను, ఆశ్రితులను, ఆశ్రయమిచ్చిన వారిని, అనాథలను గుర్తించి వారికి తిలోదకాలను ఇవ్వడం పుణ్యకార్యంగా గుర్తించాలి. 'మరణాంతాని వైరాణి' అంటాడు రాముడు. బంధువుల మధ్య వైరభావన ఉన్నా వారికి తర్పణాదులు విడవవలసిందే. పితృదేవతలను స్మరించి వారికి కృతజ్ఞతలు తెలుపుకునే ఉత్సవమిది. "కృత" చేసిన మేలు "జ్ఞ" జ్ఞాపకం "త" విధానం. అంటే చేసిన మంచిని గుర్తించి జ్ఞాపకం చేసుకునే విధానమే కృతజ్ఞతలు తెలుపడం. ఎందుకు స్మరించాలి? అనాదిగా వారిచ్చిన అనుభవ జ్ఞానాన్ని స్వీకరించినందుకు వారిని స్మరించాలి. కృతజ్ఞతలు తెలపకపోవడం కృతఘ్నత అవుతుంది.

ఇక పితృయజ్ఞం అంటే.. **"యత్పితృభ్య స్వధాకరోత్యప్యపస్తత్పితృ యజ్ఞస్సంతిష్టతే"** అన్నారు. పితృదేవతలకు "స్వధా" శబ్దంతో తర్పణం చేయడం.. పితృయజ్ఞం. సిద్ధమైన అన్నాన్ని అంగుష్ఠ, అనామిక (బొటనవేలు, చూపుడు వేలు) వేళ్ళ మధ్యనుండి "పితృభ్య స్వధాస్తు" అని భూమిపైన విడిచిపెట్టడం పితృయజ్ఞంగా చెప్పబడుతుంది. పితృకర్మలను

శ్రుతి, స్మృతులు సూచించిన ప్రకారం పితృయజ్ఞాన్ని నిర్వహించాల్సిన ఆవశ్యకతను ఋషులు చెప్పారు. ఇవి అవశ్యమైన ఆచరణీయ కర్మలుగా వేదం నిర్దేశించింది.

చనిపోయిన వారిని ప్రేతగా పిలుస్తారు. సపిండీకరణ తదుపరి వారు పితృదేవతలుగా పితృలోకానికి చేరుకుంటారు. పితృలోకాలు ఎక్కడ ఉంటాయి. తైత్తరీయ బ్రాహ్మణం భూలోకం పైన అంతరిక్షం, ఆపైన పితృలోకం ఉంటుందని చెపుతుంది. అథర్వవేదం ఆకాశంలో మూడు కక్ష్యలు ఉంటాయని, మొదటి కక్ష్య జలమయమైనదని, రెండవ కక్ష్య పరమాణు రూపమైనదని, మూడవ కక్ష్య తేజోమయమైనదని అందులో పితరులు ఉంటారని చెపుతుంది.

భస్మీభూతమైన శరీరం తిరిగి ఎలా వస్తుంది? వ్యక్తి బ్రతికి ఉన్నప్పుడు వానికి పెట్టిన భోజనం ఉపయోగమవుతుంది కాని మరణించిన వానికి పిండాలు పెడితే వానికెలా చేరుతుంది? ఇవి సందేహాలు. శ్రాద్ధాదులు ఆచరించే కొందరిలోనూ ఈ అనుమానా లుంటాయి. కాని ఎన్నో శాస్త్రీయ ఆధారాలు పునర్జన్మను నిరూపించగా, హైందవ విశ్వాసానికి మూలమైన వేదం శ్రాద్ధాదులను నిర్ధారించినది కాబట్టి వాటిని శ్రద్ధతో ఆచరించాలి. **"శ్రద్ధయా క్రియతే అనేన ఇతి శ్రాద్ధః"**. పెట్టే వాని శ్రద్ధ, సంకల్పబలం, మంత్రశక్తి వల్ల మనమర్పించే తర్పణ, పిండాదులు సూర్యుని ద్వారా చేరవలసిన వారికి తప్పక చేరుతాయని శాస్త్రాలు చెపుతున్నాయి. పునర్జన్మ ఉన్నదంటున్నాము. ఒకవేళ వారిప్పటికే మరొకజన్మ నెత్తినా వారికి శ్రాద్ధాలు నిర్వహించవలసిందే. అలాగే గయాదులలో శ్రాద్ధాదులు ఆచరించినా మనం జీవించినంత కాలం శ్రాద్ధాదులు ఆచరించాల్సిందే, అంటుంది శాస్త్రం. తల్లిదండ్రులు దేవలోకంలో ఉంటే మనం ఇచ్చే పిండ రూపంలోని భోజనం వారికి అమృతరూపంలో చేరుతుంది. వారు నాగరూపంలో ఉంటే వాయురూపంలో వారిని చేరుతుంది. దనుజ రూపంలో ఉంటే మాంసం రూపంలో చేరుతుంది అలాగే రాక్షస రూపంలో ఉంటే రక్తం రూపంలో వారిని చేరుతుంది అంటుంది శాస్త్రం.

ప్రేతను, పితృదేవతలను ఉద్దేశించి ప్రియమైన భోజనాన్ని శ్రద్ధతో సమర్పించడం శ్రాద్ధం అనబడుతుంది. నిజానికి దీని ఉద్దేశ్యం లేదా భావన.. పితరులను ఉద్దేశించి శ్రాద్ధకర్తచేత మానసికంగా త్యాగం చేయబడిన దానిని బ్రాహ్మణులు స్వీకరించడం శ్రాద్ధశబ్దానికి అర్థమని పెద్దలు చెపుతారు. అగ్నౌకరణం, పిండప్రదానం, బ్రాహ్మణ భోజనం ఈ మూడూ శ్రాద్ధ శబ్దానికి అర్థాలని పెద్దలు ప్రవచిస్తారు. అయినా సంక్రమణ, గ్రహణ శ్రాద్ధాదులయందు ఇందులో ఏ ఒక్కటి లోపించినా శ్రాద్ధానికి అభ్యంతరం లేదని చెపుతారు.

కూర్మపురాణంలో శ్రాద్ధకర్మల ప్రాశస్త్యాన్ని, విధి విధానాలను సవివరంగా వివరించారు. శ్రాద్ధ యోగ్యాయోగ్య వివరణను, శ్రాద్ధ ధర్మ విశేషాలను వివరంగా సూచించారు. ఎంతమంది బ్రాహ్మణులను నియమించాలి, ఎవరు ఏయే స్థానాలలో కూర్చోవాలి.. ఇలాంటి సూక్ష్మాంశాలను కూడా చర్చించింది కూర్మపురాణం. అనాచారాలను గూర్చి చెపుతూ, ఒక శ్రాద్ధమున భుజించి మరొక శ్రాద్ధమున భుజించినచో మహాపాతకులతో సమానమైన నరకాన్ని చేరుకుంటారని శాసించింది.

ఈ పితృ కార్యక్రమాన్ని సముద్రతీరంలో లేదా నదీ తీరంలో లేదా ఇంటిలో నిర్వహించాలి. కార్యక్రమ నిర్వహణలో కనీసం నలుగురు బ్రాహ్మణులను అర్చించాలి. వీరినే సంకర్షణ, అనిరుద్ధ, ప్రద్యుమ్న, వాసుదేవ అంటారు. వీరిపై పితృదేవతలను ఆవాహన చేసి అర్చించి, భోజన తాంబూలాదుల ద్వారా తృప్తి పరచడం విధిగా చెప్పబడింది. శ్రాద్ధకాలంలో వచ్చిన అతిథులకు అన్నదానం చేయడం వల్లనే పితృదేవతలు తృప్తిని పొందుతారని కూర్మపురాణం చెపుతుంది, పితృదేవతలు తృప్తులైతేనే కార్యక్రమ నిర్వాహకునికి క్లేశ (దుఃఖము), కర్మ (చేసే పని), విపాక (ఫలితం), ఆశయములు (సంచితములు) తొలిగిపోయి క్షేమం కలుగుతుంది.

మరణించిన సమయంలో వెలగపండు పరిమాణంలో, అబ్దికాలలో కొబ్బరికాయ పరిమాణంలో, తీర్థయాత్రల సమయంలో కోడిగ్రుడ్డు పరిమాణంలో, మహాలయ సమయంలో పెద్ద ఉసిరికాయ పరిమాణంలో పిండములు పెట్టడం ఆచారం.

ఏది ఎలా ఉన్నా... విశ్వాసం అన్నింటికీ మూలమైనది. యద్భావం తద్భవతి అంటారు. విశ్వసించండి, భావన చేయండి, ఆచరించండి ప్రయోజనం పొందండి. ఎక్కడో మన పిల్లలు ఉంటారు... వారు ఆనందంగా ఉన్నారనే భావన మనలను సంతోషంగా ఉంచుతుంది... వారు అనారోగ్యంగా ఉన్నారనే వార్త మనకు దుఃఖాన్ని కలిగిస్తుంది. నిజానికి ఆ భావనయే మన సంతోషానికి లేదా దుఃఖానికి మూలం.

ఆధునిక కాలములో సనాతన ధర్మజులందరికీ ధర్మ శాస్త్ర విషయాలు, వాటికి, నిత్యజీవన విధానమునకు వున్న అవినాభావ సంబంధము, వాటిని ఆచరించడం వెనుక వున్న శాస్త్రీయత సరళమైన తెలుగులో తెలియజేయవలసిన అవసరం ఎంతైనా వున్నది. ఆ క్రమములోనే ఆస్తికులకు ముఖ్యంగా బ్రాహ్మణ వృత్తిలో ఉన్న ప్రతిఒక్కరికీ ఈ పుస్తకం ఉపయుక్తమౌతుందని విశ్వసిస్తున్నాను.

**స్వస్తి శుభం భూయాత్**

# సంస్కారములు - ప్రాచీనత

'సమ్' పూర్వక 'కృఞ్' ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము రాగా 'సంస్కార' శబ్దమేర్పడినది. 'శాస్త్ర ప్రకారముగా లేదా ఒక క్రమ పద్ధతి ద్వారా శుద్ధి చేయుట' అని దీని అర్థము. ఒక వస్తువును కానీ, ఒక పదార్థమును గానీ, ఒక శరీరమును లేదా శరీరాంగమును కానీ ఒక విశిష్ట ప్రయోజనము కొరకు యోగ్యమగునట్లుగా చేయుట అని కూడా అర్ధము.

సంస్కృత సాహిత్యమున 'సంస్కార' శబ్దము – ప్రయుక్తము, శిక్షణ, వ్యాకరణ సంబంధ శుద్ధి, పరిష్కరణము, శోభ, స్మరణ శక్తి, శుద్ధి, ధార్మిక విధి విధానము అను అర్ధములతో ప్రయోగింపబడినది.

ఒక వస్తువుకు వున్న మాలిన్యమును తొలగించుటకు మరియు దానిని సలక్షణయుతము చేయుటకు చేయు ప్రక్రియను సంస్కారము అనవచ్చును.

ఉదాహరణకు – శరీర మాలిన్యమును తొలగించుటకు, లేదా అలసట కలిగినపుడు మానసికోల్లాసమునకు స్నానం చేయడం సహజము. ఇది శరీరమునకు చేయు సంస్కారము.

అదేవిధముగా శరీరమునకు పరిమళద్రవ్యములను అంటించుకోవడం లేదా కొత్త వస్త్రములు ధరింపజేయడం కూడా ఒక శరీర సంబంధ సంస్కారమే.

ఇంటిని శుభ్రం చేసుకోవడం, వెల్ల వేయడం గృహ సంబంధ సంస్కారము.

**'సంస్కారో నామస భవతి యస్మిఙ్జాతే పదార్థో భవతి యోగ్యః'**

ఒక వ్యక్తిని లేదా ఒక పదార్థాన్ని ఒక నిర్ణీత ప్రయోజనానికి యోగ్యమైనదిగా చేసే ప్రక్రియనే 'సంస్కారం' అంటారు. ఇది జైమినీ సూత్ర భాష్యకారుడు ఇచ్చిన నిర్వచనం. వ్యక్తిని శుద్ధి చేసేవే సంస్కారాలు. సమాజానికి మేలు చేసే వ్యక్తిగా ఒకరిని తీర్చిదిద్దేవే సంస్కారాలు. కొన్ని సంస్కారాలు వ్యక్తి క్షేమం కోరేవి అయితే, కొన్ని కుటుంబ ప్రయోజనం కోరేవి. కొన్ని సంతాన వృద్ధి కోరేవి, కొన్ని సంపదను ఆశించేవి. మరికొన్ని సంఘ ప్రయోజనం కోరేవి.

వ్యతిరేక ప్రభావాలను తొలగించుకోవడం, అనుకూల ప్రభావాలను బలపరుచుకోవడం, ఇహపరమైన ప్రయోజనాలను సాధించుకోవడం, ఆత్మ వ్యక్తీకరణ జరుపుకోవడం వంటివి సంస్కారాల వల్ల కలిగే లాభాలని ప్రముఖ సిద్ధాంత కర్త రాజబలి పాండే వ్యాఖ్యానించారు.

మర్త్య లోకములో మానవులందరికీ, (స్త్రీ కానీ పురుషుడు కానీ) పుట్టడానికి ముందు నుండీ, పుట్టిన తరువాత, మరియు మరణించు వరకూ ప్రతి వ్యక్తి జీవితములో వివిధ దశలలో జీవన పురోగతి కై యోగ్యత పొందుటకు, (వ్యక్తి జన్మ సార్థకం, శుభప్రదం అగుటకు) చేసుకోవలసిన లేదా చేయవలసిన పరిశుద్ధ ప్రక్రియలను, మన సనాతన ధర్మములో "సంస్కారములు" అన్న పేరుతో సర్వోన్నత జ్ఞానస్థాయి చేరిన ప్రాచీన శాస్త్రజ్ఞులు(ఋషులు) వేదవాఙ్మయములో నిర్దేశించినారు.

సంస్కారాలలో, వివాహం, గర్భాదానం, అంత్యేష్టి వంటి కొన్ని సంస్కారాలు మనకు ఋగ్వేదంలో కానవచ్చినా, వాటిగురించిన నియమనిబంధనలు, ఆచార వ్యవహారాల వివరాలు కానరావు. యజుర్వేదంలో వీటి ప్రస్తావన కొంత ఉన్నది. ముఖ్యంగా శ్రౌత, యాగ కార్యక్రమాల్లో ముఖ్యమయిన చూడాకరణం గురించి ఉండగా, అథర్వవేదంలో అక్షరాభ్యాసం, వేదాధ్యయనం, బ్రహ్మచర్యం, వివాహం వంటి వాటిగురించిన మంత్రాలు ఉన్నాయి. సామవేదంలో సంస్కారాల ప్రసక్తి అంతగా కానరాదు.

గోపథ బ్రాహ్మణంలో ఉపనయనం గురించిన వివరణలు ఉన్నాయి. అయితే, శతపథ బ్రాహ్మణంలోనూ బ్రహ్మచర్యం అనే మాట కానవస్తుంది. ఛాందోగ్యోపనిషత్లో వేద విద్యారంభ ప్రక్రియకు సంబంధించిన విషయాలు ఉన్నాయి. తైత్తరీయోపనిషత్లో స్నాతకోత్సవం గురించి ఉంది. బ్రాహ్మణాల్లోనూ, ఉపనిషత్ల లోనూ ఉన్న వాటికి మరికొంత వివరణలను మనకు కల్పసూత్రాలు అందిస్తున్నాయి. ఈ కల్పసూత్రాలు అనేక రకాలు.

గృహ్య సూత్రాలలో వివాహంతో ఆరంభించి సమావర్తనం వరకూ గల వాటిని పేర్కోనడం జరిగింది. అయితే వీటి గురించి పారస్కరుడు, అశ్వలాయనుడు, బౌధాయనుడు మాత్రమే సవివరంగా తెలియజేశారు.

వీటికి అదనంగా 'పరిశిష్టాలు' (శేషభాగాలు), 'వ్యాఖ్యానాలు', 'ప్రయోగాలు', 'కారికలు', వీటన్నిటికీ మరింత జోడింపుగా 'ఆర్షవాక్యాలు' కూడా ఉన్నాయి. వీటన్నింటి లోనూ సంస్కారాల ప్రస్తావన ఉందంటే, ఈ సంస్కారములు ఎంత ప్రాచీనమో వీటికి మన ప్రాచీనులు ఎంతటి ప్రాముఖ్యత ఇచ్చారో అర్థం చేసుకోవచ్చు.

## ఇష్టి – అంత్యేష్టి

'ఇష్టి' అనగా సంస్కృతములో ఒక 'కార్యము' లేదా 'యజ్ఞము' అని అర్థము.

సంతానము కలగాలనే కోరికతో చేయు కార్యము/ యజ్ఞము 'పుత్రకామేష్టి' అంటారు.

'అంత్య' అనగా 'చివర'. 'చివరిది'గా (ఒకరి కొరకు) చేయు కార్యమును "అంత్యేష్టి" అనవచ్చును.

అది ఒక "సంస్కారమ"ను భావన (విధానము) తో చేయవలసి వుంటుంది కనుక దానిని "అంత్యేష్టి సంస్కారము" అంటారు. ఈ సంస్కారము ఎవరి కొరకైతే చేయ బడునో, మరియు ఎవరైతే చేయుదురో, అది చేసి నందు వలన, చేసిన వారు, చేయబడిన వారు ఏదో విశిష్ట ప్రయోజనము పొందుటకు యోగ్యులగుదురని భావము.

## సంస్కారములు ఎందుకు?

**శ్లో॥ చిత్రం క్రమాద్యథానేకై, రంగైరున్మీల్యతే శనైః ।**
**బ్రాహ్మణ్యమపితద్వత్స్యా, త్సంస్కా రైర్విధిపూర్వకైః ॥**

చిత్రలేఖిని (కలము) మాటిమాటి కట్లిట్లు త్రిప్పబడుట వలన చిత్రము (చిత్తరువు) సర్వాంగములతో సంపూర్ణమైనట్లు విధి పూర్వకములగు సంస్కారముల యనుష్ఠానము వలన మానవునికి కావలసిన సకల సద్గుణములు, యోగ్యతలు వికసింప గలవు.

## సంస్కారముల లక్ష్యము

జీవుని శరీరమును బ్రహ్మత్వ యోగ్యము చేయుట

సంస్కారములు - జీవాత్మ పూర్ణత్వము నొందుటకు మార్గములు.

ధర్మ శాస్త్రములలో కొన్ని నలుబది సంస్కారములనియు, కొన్ని ఇరువదైదనియు, కొన్ని పదునారనియు చెప్పబడుచున్నవి.

వేదాంత దృష్టి కోణముతో మీమాంసా శాస్త్రమునను సరించి చెప్పబడిన షోడశ సంస్కారములు క్రింది విధముగా వున్నాయి.

## ప్రవృత్తి నిరోధకములు

1. ఆధానం (గర్భాధానము)
2. పుంసవనం
3. సీమంతోన్నయనం
4. జాతకర్మ
5. నామకరణం
6. అన్నప్రాశనం
7. చౌలం (చూడాకరణము)
8. ఉపనయనం

### నివృత్తి పోషకములు

9. బ్రహ్మవ్రతం
10. వేదవ్రతం
11. సమావర్తనం
12. ఉద్వాహః (వివాహము)
13. అగ్న్యాధానం (గృహస్థాశ్రమ విధి)
14. దీక్షా (గృహస్థాశ్రమ విధి)
15. మహావ్రతం (గృహస్థాశ్రమ విధి)
16. సన్యాసః

*(ఆధారం: శ్రీ చివుకుల అప్పయ్య శాస్త్రి గారి "షోడశ సంస్కారములు")*

'గౌతమ స్మృతి' గర్భాధానము, పుంసవనము, సీమంతోన్నయనము, వివాహము, పంచ మహా యజ్ఞములు, అష్టక శ్రాద్ధములు, పార్వణ శ్రాద్ధములు మున్నగునవి నలుబది సంస్కారములని వర్ణించినది.

అంగీరస మహర్షి, సంస్కారములు ఇరువదైదని చెప్పిరి. ఇట్లే వ్యాసులవారు తమ స్మృతి యందు గర్భాధానము, పుంసవన, సీమంతో న్నయన, జాతకర్మ, నామకరణ, నిష్క్రమణ ప్రభృతి పదునారు సంస్కారములని లిఖించిరి.

### షోడశ సంస్కారములు

**జననమునకు ముందు తలిదండ్రులు చేయు సంస్కారములు (3)**

గర్భాధానం , పుంసవనం, సీమంతోన్నయనం,

**బాల్యమునందు శిశువుకు తలిదండ్రులు చేయు సంస్కారములు (5)**

జాతకర్మ, నామకరణం, అన్నప్రాశనం, చౌలము, ఉపనయనం

**శిశువుకు కౌమార యవ్వన దశలలో, గురు కులములో విద్యార్జన ప్రక్రియలో గురువులు చేయు సంస్కారములు (6)**

ప్రాజాపత్యవ్రతము, సౌమ్యవ్రతము, ఆగ్నేయవ్రతము, వైశ్వదేవవ్రతం, గోదానవ్రతము (కేశాంతం), స్నాతకవ్రతం (సమావర్తనం)

**విద్యాభ్యాసము పూర్తైన తరువాత బ్రహ్మచర్యాశ్రమం ముగించుకొని గృహస్థాశ్రమ ధర్మం స్వీకరించుటకు స్వయముగా చేసుకొను సంస్కారము (1)**

వివాహం

**మరణించిన పిదప సంతానము కానీ, దగ్గరి వారు కానీ చేయు సంస్కారము (1)**

అంత్యేష్టి

ఈ సంస్కారములను చేసే విధాన క్రమములో మొదటి **15 (పంచ దశ) పూర్వ కర్మలుగా, చివరి ఒక్కటి 'అపర' లేదా 'ఉత్తర' కర్మగా,** సామాన్యుల పరిభాషలో "సంప్రదాయములు/ విధులు/ ఆచారములు" గా, గుర్తించ బడినాయి.

## సంస్కారములు ఎవరికి?

భారతీయ వేదవాఙ్మయములో, ప్రాణులలో శరీరము, ఆత్మ వేరువేరని చాలా లోతైన వేదాంత జ్ఞానముతో చర్చించబడి నిర్ణయించబడినది. ప్రాణి శరీరము పంచభూతాత్మిక శక్తి స్వరూపము. ఇది కాలధర్మం ప్రకారం నశిస్తుంది. శరీరమునాశ్రయించిన ఆత్మ, సృష్టిలో వున్న చైతన్యమునకు ప్రతీక. దీనికి నాశనము లేదు. అందువలన, నిర్దేశించిన సంస్కారములన్నియు జీవించుటకై శరీరమునకే అవసరమైనవి. అయితే ఇవి ఆత్మకు ఉన్నతిని, గుణాత్మకముగా జన్మాంతరమున కూడా ఉత్తమమైన జీవితమును పొందుటకు ఉపకరిస్తాయి.

## షోడశ సంస్కారములు - ప్రయోజనములు

మనిషి పుట్టుకనుంచి చనిపోయేవరకు సంస్కారమయమే. ఋషులు సూచించిన 16 సంస్కారముల ద్వారా శరీరము మరియు ఆత్మ సంస్కరింపబడుతూ మరణం తర్వాత ఉత్తమ గతులు పొందడం జరుగుతుంది. సంస్కారాల వలన జన్మాంతర దోషాలు కూడ తొలగి మానవ జీవిత లక్ష్యమైన మోక్షప్రాప్తికి అవకాశము లెక్కువగా వుంటాయి.

సంస్కారాల ఆచరణ మనిషి జన్మించడానికి ముందుగానే, అంటే, తల్లి గర్భంలో పిండంగా ఏర్పడే ముందు నుండే పిండం, పవిత్రంగా ఏర్పడాలన్న లక్ష్యముతో తలిదండ్రుల (స్త్రీ పురుష) సంయోగం మంత్రం చేత పునీతమగుటకు "గర్భాధాన" సంస్కారముతో మొదలవుతుంది. అంటే తల్లి గర్భంలో ఏర్పడే పిండం పవిత్రంగా ఏర్పడి అనంతర సంస్కారముల ద్వారా మనిషిగా జన్మించి, సార్ధకంగా జీవించుటకు మార్గం సుగమం అవుతుంది.

వేదోపనిషత్తుల ప్రకారం సప్తధాతువుల నిర్మాణమైన మానవ శరీరం ఐదు కోశముల మయంగా విభజింపబడింది.

1. అన్నమయ కోశం - భౌతిక శరీరం,
2. ప్రాణమయ కోశం - శక్తి కేంద్రం,

3. మనోమయ కోశం - చింతనా కేంద్రం,

4. బుద్ధిమయ కోశం - వివేకం,

5. ఆనందమయ కోశం - పరమశాంతి.

మానవ శరీరంలో ఈ ఐదు కోశములు, షోడశ సంస్కారాల ద్వారా సక్రమమైన రీతిలో చలిస్తాయనేది శాస్త్రవచనం. ఈ సంస్కారాల వెనుకనున్న వైజ్ఞానిక రహస్యాలు పరిపూర్ణ పరిశోధన ద్వారానే తెలిసి వస్తాయి.

**"సంస్కార" ప్రక్రియలు** (Reform processes) **ప్రధానముగా మూడు.**

1. దోష మార్జనములు (Cleaning processes),
2. అతిశయాధానము (Value addition),
3. హీనాంగపూర్తి (Additional inputs)

ప్రకృతిలో ఏ పదార్థమైనా మొదట కల్మషముగానే ఉంటుంది. ఏ పదార్థమునైనను సంస్కరించుటకు ఈ మూడు ప్రక్రియలు అవసరమే. ఉదాహరణకు - గని లో నుండి తీయబడిన లోహము ఖనిజ రూపమున మిక్కిలి మలినముతో గూడి యుండును. దానిని ఉపయోగించుకొనుటకు (ఇనుప ఖనిజముతో కత్తిని చేయుటకు) ముందుగా ఖనిజమును శుద్ధి చేయవలసివుంటుంది. ఇదియే "దోషమార్జనము". తరువాత దానికి యధోచితముగా అగ్ని, వాయు, ద్రవములతో ఉపయోగకరమైన రూపము కలిపించాలి. (ఇనుముకు కత్తిరూపము ఇవ్వాలి) దీనినే "అతిశయా ధానము" అంటారు. అనంతరము ఆ రూపమునకు కావలసిన ఇతర సింగారములు చేసిన తరువాతే అది ఉపయోగకరమైన వస్తువు అవుతుంది. (కత్తికి పిడిని కూర్చడం). ఇది "హీనాంగపూర్తి" ప్రక్రియ. పత్తిచెట్టు కాయలనుండి పత్తిని వేరుచేసి, శుభ్రం చేసి (దోషమార్జనము) దారము గా మార్చి వస్త్రములు తయారుచేసి (అతిశయాధానము) కావలసిన విధముగా కుట్టుకోవడం (బొత్తాములు - గుండీల తో సహా) "హీనాంగపూర్తి" తరువాత వస్త్రధారణ వీలవుతుంది. ఇదంతా పత్తిని, ధరించు వస్త్రముగా, సంస్కరించు ప్రక్రియ.

## షోడశ సంస్కారములు - సంస్కార ప్రక్రియలు

**1. దోష మార్జనములు** - గర్భాధానం, పుంసవనం, సీమంతోన్నయనం, జాతకర్మ, నామకరణం, నిష్క్రమణం, అన్నప్రాశనం, చౌలము (చూడాకర్మ)

**2. అతిశయాధానము** - ఉపనయనం నుండి సమావర్తనం వరకు

**3. హీనాంగపూర్తి** - వివాహం, అంత్యేష్టి

## సంఘజీవులైన మానవులకు షోడశ సంస్కారముల వలన కలిగే ప్రయోజనములు, విశేషముల సారాంశము :

### 1. గర్భాధానం

మనిషి జన్మకు కారకమైన గర్భక్షేత్రాన్ని సంస్కరించడమే గర్భాధాన సంస్కారము. స్త్రీ పురుష సంయోగం ద్వారా పుట్టబోయే సంతానం యోగ్యులుగా ఉండేందుకై ఈ సంస్కారం నిర్దేశించబడింది.

### 2. పుంసవనం

తల్లి గర్భంలోని పిండం పవిత్రంగా ఏర్పడేందుకు ఉద్దేశించబడిన సంస్కారమే పుంసవనం. కాలక్రమం లో పురుష జన్యుకణములు అంతరించకుండా పురుష సంతానము కొరకు చేయు సంస్కారము కూడా.

### 3. సీమంతోన్నయనం

గర్భవతి సౌభాగ్యాన్ని, పుట్టబోయే శిశువు దీర్ఘాయుష్షును కోరుతూ చేసే సంస్కారం. గర్భవతికి ఈ సంస్కారాన్ని నిర్వహించడం వల్ల దుష్టశక్తుల నుంచి రక్షింపబడుతుంది.

### 4. జాతకర్మ

బిడ్డకు నెయ్యిని రుచి చూపి, పది నెలలు తల్లి గర్భంలో ఉండి ఈ ప్రపంచానికి వచ్చిన జీవికి జరిపే తొలి సంస్కారం ఇది. ఈ సంస్కారము వలన గర్భవాసమున తల్లి ఆహార రసమును గ్రోలుట వలన కలిగిన యెల్ల దోషములు నష్టమగును.

### 5. నామకరణం

బిడ్డ సమాజంలో తనకంటూ ఓ వ్యక్తిత్వంతో వృద్ధి లోకి రావాలన్న కోరికతో తల్లి దండ్రులు జరిపే సంస్కారం. ఆయుర్వృద్ధి, తేజోవృద్ధి, ప్రపంచమందు నామ వ్యవహార సిద్ధి కలుగుతాయి..ఆడ, మగపిల్లలకు పెట్టే పేర్లకు సంబంధించిన నియమాలు గృహ్యసూత్రాలలో వున్నాయి. పరాశర గృహ్యసూత్రాల ప్రకారం శిశువు పేరు రెండు లేక నాలుగు అక్షరాల పొడవు ఉండి, హ్రస్వ అచ్చుతో కూడిన హల్లుతో మొదలై చివర దీర్ఘంకానీ, విసర్గకానీ ఉండాలి. అయితే వేరువేరు గృహ్య సూత్రాలలో ఈ నియమాలు వేర్వేరుగా ఉన్నాయి. శిశువుకు పేరు పెట్టడానికి నాలుగు పద్ధతులున్నాయి. మొదటిది జన్మ నక్షత్రాన్ని బట్టి. రెండవది పుట్టిన భారతీయ నెల, రాశ్యాధిపతిని బట్టి. మూడవది ఇంటి ఇలవేలుపును బట్టి. నాలుగవది అందరూ పిలిచే పేరును బట్టి పేర్లు ఉంటాయి.

## 6. నిష్క్రమణం

ప్రసవానంతరము తల్లి మొదటిసారిగా మంత్రపూర్వకముగా సూర్యనారాయణ మూర్తి దర్శనం చేస్తుంది. బిడ్డను తొలిసారిగా బయటకు తీసుకెళ్ళడం, చంటిబిడ్డను విభిన్న వాతావరణాలకు పరిచయం చేయడమే ఈ సంస్కారంలోని అంతరార్ధం. పుట్టినప్పటి నుండీ ఇంటిలో పెరిగిన శిశువు తొలి సారి బయట ప్రపంచంలో అడుగు పెడుతున్నప్పుడు ఆ బిడ్డను బలమైన, అతీత, ప్రకృతి శక్తుల నుండి కాపాడ దానికి ఆది భౌతికము, ఆధ్యాత్మికము ఐన చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. అందుకే ఈ సంస్కారం ముఖ్యమైనదిగా భావిస్తారు.

## 6. అన్నప్రాశనం

మాతృగర్భమందలి మాలిన్యమును భక్షించుటచే వచ్చిన దోషము నిర్మూలమగుటకు మరియు పెరిగే బిడ్డకు భౌతికావసరాలు తీర్చడానికి ఘనాహారం ఇవ్వడం మొదలు పెట్టే ప్రక్రియ ఇది. సుశృతుడు కూడా శిశువుకు ఆరోనెలలో తల్లిపాలు మాన్పించి ఘన ఆహారం ఇవ్వాలన్నాడు.

## 7. చౌలము (చూడాకర్మ)

దీర్ఘాయుష్షు, అందమైన రూపం కలగాలని ఆశిస్తూ చేసే సంస్కా రం ('కేశ ఖండనం' లేదా "చూడాకరణ" అని కూడా అంటారు) మొదటిసారి తల వెంట్రుకలు తీయించడం. సుశృతుడు, చరకుడు కూడా పుట్టువెంట్రుకలు తీయించడం వలన అందం, ఆరోగ్యం, దీర్ఘాయుష్షు కలుగుతాయని చెప్పారు. ఈ సంస్కారం బిడ్డ మొదటి గానీ, మూడవ ఏటగానీ చేస్తారు. పుట్టువెంట్రుకలను తీయించడం ఈ సంస్కారంలోని ప్రత్యేకత.

## 8. ఉపనయనం (అక్షరాభ్యాసం, కర్ణవేధ)

బిడ్డ కొంత మానసిక పరిపక్వత చెంది, క్రొత్త విషయాలు నేర్చుకోడానికి సిద్ధపడే సమయంలో చేసే సంస్కారాన్ని 'అక్షరాభ్యాసం' అంటారు. మామూలుగా ఈ సంస్కారాన్ని బిడ్డడి ఐదవ ఏట చేస్తారు. విశ్వామిత్ర మహర్షి ఏడవ ఏట చేయాలని నిర్దేశించాడు. కొడుకును విద్యార్జన కోసం గురువు దగ్గరకు పంపేముందు జరిపే సంస్కారాన్ని 'ఉపనయనం' అంటారు. ఉపనయనంతో వ్యక్తి రెండవ జన్మ ఎత్తినట్లవుతుంది. అందుకే వడుగు అయిన వటువును ద్విజుడు అంటారు. అతి పవిత్రము, శక్తివంతము అయిన గాయత్రీ మంత్రాన్ని తండ్రి తన కొడుకు చెవిలో ఉపదేశిస్తాడు. ఉపనయన సమయంలో

వటువు సూర్యునివైపు చూస్తుండగా, ఆ బాలునికి బలం, తేజస్సు, దీర్ఘాయుష్షు, పవిత్రత కలగాలని భావిస్తూ, గురువు ఈ సంస్కారం నిర్వహిస్తాడు.

**కర్ణభేధ :** చెవులు కుట్టించడం. బిడ్డడికి ఐదేళ్ళ లోపు చేయవలసిన సంస్కారం. కర్ణాభరణాలు ధరించడం అందం కోసమే కాక, ఆరోగ్య రీత్యా కూడా అవసరం. చెవులు కుట్టడంలో వైజ్ఞానికత వుందనీ, అందువలన శిశువుకు మేధోవృద్ధి కలుగుతుందనే భావన కూడా వున్నది.

## 9. ప్రాజాపత్యవ్రతము, 10. సౌమ్యవ్రతము
## 11. ఆగ్నేయవ్రతము 12. వైశ్వదేవవ్రతం

ఉపనయనము అనంతరం గురువుల వద్ద వేదాధ్యయనము నాలుగు విభాగములుగా సంపూర్ణ విద్యార్జన చేయుట. ఇవి గురువులు నిర్వర్తించే 4 సంస్కారములు

## 13. గోదానవ్రతము (కేశాంతం)

పదాహారేళ్ళ వయసు వచ్చాక మొదటిసారి గడ్డం గీసుకోడానికి సంబంధించిన సంస్కారాన్ని గోదానవ్రతము (కేశాంతం) అంటారు.

## 14. స్నాతకవ్రతం (సమావర్తనం)

విద్యాభ్యాసం ముగిసి, గురుకులాన్ని వదిలి వెళ్ళేటప్పుడు నిర్వహించే సంస్కారాన్ని 'స్నాతకము' లేదా 'సమావర్తనం' అంటారు. సమావర్తనంతో విద్యాభ్యాసం ముగించుకొని ఇంటికి తిరిగి వచ్చిన యువకుని ముందర రెండు మార్గాలుంటాయి. 1 ఉద్యోగం చేస్తూ, ధనం సంపాదించి, పెండ్లి చేసుకొని, గృహస్థ జీవితం గడపడం, 2 గడించిన జ్ఞానంతో భౌతిక, మానసిక సంబంధాలకు దూరముగా, జపతపాలతో ఆధ్యాత్మిక జీవితం గడపడం. మొదటి మార్గం అనుసరించే వారిని 'ఉపకుర్వనులు' అని, రెండవ మార్గంలో ఉన్నవారిని 'నైష్ఠికులు' అని అంటారు. ఏ మార్గం అనుసరించాలన్నా గురువు అనుమతి తప్పని సరి.

## 15. వివాహం (గృహస్థాశ్రమ స్వీకారం)

గృహస్థాశ్రమంలో కావలసిన సహధర్మచారిణిని అన్వేషించి, ఎన్నుకొని ఇరువురి ఆత్మోన్నతికి, వంశాభివృద్ధికి విద్యావంతుడైన బ్రహ్మచారి స్వయంగా చేసుకొనే అతి ముఖ్యమైన సంస్కారము. ఇది అత్యంత విశిష్టమైన భారతీయ కుటుంబ వ్యవస్థకు

మూలాధారము. వివాహ సమయంలో వధూవరులచే పలుమంత్రాలు చెప్పించబడుతుంటాయి. ఆ సమయంలో వరుడు, "భగ, ఆర్యమ, సవిత, పురంధి అనే దేవతలు గార్హపత్యం కోసం నిన్ను నాకు అనుగ్రహించగా, నా జీవితం సుఖమయం అయ్యేందుకు నీ చేయిని నేను పట్టుకున్నాను" అని వధువుతో చెబుతాడు.

సామాజిక, సాంస్కృతిక పరిణామక్రమములో ఈ సంస్కారము నిర్వహించు కొనుటలో ఎన్నో మార్పులు వచ్చాయి. కాబోయే వధూవరుల తలిదండ్రులు మాత్రమే తమ బిడ్డలకు వివాహం చేయడం ఒక ఆచారమైనది. ఇటీవలి కాలములో ఇరువైపులా తలిదండ్రులు ప్రేక్షక పాత్ర వహిస్తూ వధూవరులే వివాహ నిర్ణయము తీసుకోవడం మొదలయ్యింది. ప్రాచీన కాలములో సమాజ ధర్మములననుసరించి కొనసాగిన ఈ సంస్కార ప్రక్రియ మరియు ఆచారములు ఆధునిక కాలములో సంకుచితములై వ్యక్తిగత జీవిత ఉన్నతి కి మాత్రమే ప్రాధాన్యమునిస్తూ  పాశ్చాత్య నాగరికతా ప్రభావముతో భారతీయ వివాహ మరియు కుటుంబ వ్యవస్థ రూపురేఖలను మార్చి వేస్తున్నాయి. వివాహ సంస్కారముతో గృహస్థాశ్రమ ధర్మం స్వీకరించిన మోక్షగామి అయిన మానవులు అనంతర ఆశ్రమములైన వానప్రస్థము, సన్యాసము స్వీకరించుటకు యోగ్యత పొందుతారు.

## 16. అంత్యేష్టి

వ్యక్తి మరణానంతరము పితృ ఋణం తీర్చుకునేందుకు (సంతానము) పుత్రులు చేయు సంస్కారము. ఈ సంస్కారము చేయబడినవారు మరియు చేసిన వారు తమ జీవిత విశిష్ట ప్రయోజనము పొందుటకు యోగ్యులవుతారు. సన్యాసాశ్రమం స్వీకరించిన వారు  మరణించినప్పుడు వారి అంత్యేష్టి సంస్కార  విధానము వేరుగా వుంటుంది.

## ప్రాచీన షోడశ 'సంస్కారములు' –
## సంబంధిత ఆధునిక షోడశ 'కర్మ'లు

| క్ర.సం | షోడశ సంస్కారములు | క్ర.సం | షోడశ సంస్కారముల మూల భావన సంబంధంగా నేటి కాలములో సాధారణముగా వాస్తవంగా ఆచరించేవి |
|---|---|---|---|
| 1 | గర్భాధానం | 1 | గర్భాధానం (అరుదుగా) |
| 2 | పుంసవనం | 2 | పుంసవనం (అరుదుగా) |
| 3 | సీమంతోన్నయనం | 3 | సీమంతం |
| 4 | జాతకర్మ | 4 | బారసాల (బాలసారె) (పురుడుపోయుట) |
| 5 | నామకరణం | 5 | నామకరణం |
| 6 | అన్నప్రాశనం | 6 | అన్నప్రాశనం |
| 7 | చౌలము | 7 | కేశ ఖండనం, కర్ణవేధ (చెవులు కుట్టుట) |
| 8 | ఉపనయనం | 8 | అక్షరాభ్యాసం- విద్యారంభం |
| 9 | ప్రాజాపత్యవ్రతము | 9 | ప్రాధమిక పాఠశాల ప్రవేశం |
| 10 | సౌమ్యవ్రతము | 10 | ఉన్నత పాఠశాల స్థాయిలో విద్యాలయంలో చేరడం |
| 11 | ఆగ్నేయవ్రతము | 11 | కళాశాల స్థాయివిద్య పూర్తి చేయడం |
| 12 | వైశ్వదేవవ్రతం | 12 | ఉన్నత / విశ్వవిద్యాలయ స్థాయి విద్య పూర్తి చేయడం |
| 13 | గోదానవ్రతము (కేశాంతం) | 13 | విద్యాభ్యాసం తరువాత వృత్తి/ ఉద్యోగముల కొరకు ప్రయత్నములు |
| 14 | స్నాతకవ్రతం (సమావర్తనం) | 14 | వృత్తి/ ఉద్యోగములు లభించి వివాహ యోగ్యత పొందడం |
| 15 | వివాహం | 15 | వివాహం |
| 16 | అంత్యేష్టి | 16 | కర్మ కాండ లేదా దశ దిన కర్మ |

భారతీయ కుటుంబ వ్యవస్థలో, పంచదశ కర్మలు, మనిషికి తలితండ్రులు/గురువుల పై ఆధారపడి వున్నపుడు వారు 'చేయవలసిన' కర్మలు. అందులో ఒకే ఒక్కటి మాత్రం (తలిదండ్రుల ఆధ్వర్యములోనే) వ్యక్తి స్వయముగా చేసుకొనునది - 'వివాహము'.

పదునాఱవది 'అంత్యేష్టి'. మరణించిన వ్యక్తి సంతానము యొక్క బాధ్యత.

సంస్కారముల శాస్త్రీయ అవగాహన కొరకు ప్రమాణ గ్రంధములు:

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥** *శ్రీమద్భగవద్గీత 16.24*

ఏది చేయాలి, ఏది చేయకూడదు అన్న విషయంలో శాస్త్రములనే ప్రమాణముగా తీసుకొనుము. శాస్త్ర విధి విధానాలు, ఉపదేశాలను తెలుసుకొనుము మరియు ఆవిధంగానే ఈ జగత్తులో ప్రవర్తించుము. (గీతాకారుడు)

**ధర్మం జిజ్ఞాస మానానామ్ ప్రమాణం ప్రథమం శ్రుతిః**
**ద్వితీయం ధర్మశాస్త్రం తు తృతీయో లోకసంగ్రహః**

ఏ విషయములో అయినా వేదములు, ధర్మ శాస్త్రములు, లోకాచారములు క్రమంగా ప్రమాణములుగా గ్రహించాలి.

**శ్రుతిస్మృతిపురాణోక్తా ధర్మయోగ్యస్తు నేతరే**

శృతి, స్మృతి పురాణములలో చెప్పినవే ప్రమాణములు. ఇతరములు కావు

**శ్రుతి స్మృతి పురాణం విరోధో యత్ర దృశ్యతే**
**తత్ర శ్రోతం ప్రమాణస్తు తయోర్ద్వ్యధే స్మృతిర్వరా ?** (వ్యాస స్మృతి )

వేదం, స్మృతి మరియు పురాణాల మధ్య వైరుధ్యాలు స్పష్టంగా కనిపిస్తే, 'వేదం'; మరియు మిగిలిన రెండు (స్మృతి మరియు పురాణం) వైరుధ్యంలో ఉన్న చోట, 'స్మృతి' ప్రమాణములుగా గ్రహించాలి.

**వేదములు :** ఋగ్యజుస్సామాధర్వణ వేదములు (బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు)

**శాస్త్రములు :** ధర్మ శాస్త్ర/ సూత్ర ప్రవర్తకులు (57)

**స్మృతులు :** మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి, దేవల స్మృతి, నారదస్మృతి, వ్యాసస్మృతి

**స్మృతికారులు (21)** - వసిష్ఠ, నారద, సుమంతు, పితామహ, బభ్రు, కారేష్ణాజిని, సత్యవ్రత, గార్గ్య, దేవల, జమదగ్ని, భరద్వాజ, పులస్త్య, పులహ, క్రతు, ఆత్రేయ,

ఛాగలేయ, మరీచి, వత్స, పారస్కర, ఋష్యశృంగ, బైజవాప

**ఉప స్మృతికారులు (18)** – జాబాలి, నచికేత, స్కంద, లోగాక్షి, కశ్యప, వ్యాస, సనత్కుమార, శంతను, జనక, వ్యాఘ్ర, కాత్యాయన, జతుకర్ణ్య, కపింజల, బోధాయన, కణాద, విశ్వామిత్ర, పైఠీనస, గోభిల

**ధర్మ శాస్త్ర కర్తలు (18)** – మను, బృహస్పతి, దక్ష, గౌతమ, యమ, అంగిరస, యోగీశ్వర, ప్రచేతస, శాతాతప, పరాశర, సంవర్త, ఉశనస, శంఖ, లిఖిత, అత్రి, విష్ణు, ఆపస్తంబ, హరిత (అందరూ ఋషులు లేదా ప్రజాపతులు)

**గృహ్య/ధర్మ సూత్రములు** : బౌధాయన, అశ్వలాయన, ఆపస్తంబ, కాఠక, ఖాదిర, గోభిల, జైమిని, పారస్కర, భారద్వాజ, మానవ, వారాహ, వైఖానస, సాంఖ్యాయన, హరీత, హిరణ్యకేశి – గృహ్యసూత్రములు, కాత్యాయన శ్రౌతసూత్రములు, ఆపస్తంబ ధర్మసూత్ర ములు, గౌతమ ధర్మ సూత్రములు, వసిష్ఠ ధర్మ సూత్రములు, విష్ణు ధర్మ సూత్రములు, బౌధాయన ధర్మ సూత్రములు, బౌధాయన పితృ సూత్రములు, కౌశిక సూత్రములు

ఆచారకాండ, వ్యవహార కాండ , ప్రాయశ్చిత్త కాండ (జాత, మృత ఆశౌచముల గురించి ఇందు వుండును)

**పురాణములు** : అష్టాదశ పురాణములు, ఉపపురాణములు, ముఖ్యముగా – భవిష్య పురాణము, విష్ణు ధర్మోత్తర పురాణము, మార్కండేయ పురాణము, చతుర్వింశతి పురాణము, కూర్మ పురాణము, అగ్ని పురాణము, వాయు పురాణము, గరుడ పురాణము

**ఇతిహాసములు** : రామాయణము, మహాభారతము, రఘువంశము, కుమార సంభవము, ఉత్తర రామ చరిత్ర

**ఇతర ధర్మశాస్త్ర సంకలన గ్రంథములు** : పూర్వ కాలామృతము, శూద్ర కమలాకరము, ధర్మ సింధువు, నిర్ణయసింధువు

**ఇతర గ్రంథములు** : షోడశ సంస్కారములు – చివుకుల అప్పయ్యశాస్త్రి

భారతీయ సంస్కారములు – దేవరకొండ శేషగిరి రావు (టీటీడీ ప్రచురణ 1997)

**అంత్యేష్టి, ఆబ్దిక సంబంధ మంత్ర గ్రంథములు**

Dharma Vignan – Swami Dayanand
Hindu Samskar – Raja Bali Pandey
History of Dharma Shastra – 'Bharata Ratna' P V Kane
India of Vedic Kalpa Sootras,Glimpses of Vedic Nation,Survey of Indian History – K M Panickar

# సంస్కారములు, దేవ పితృ కార్యములు - 'వేదోక్త', 'పురాణోక్త' విధానములు

మానవ జీవన పరిణామ క్రమంలో, పరాకాష్ఠ చేరిన ప్రకృతి విజ్ఞానము సాధించిన పిదప, మానవులు తమ వ్యక్తిగత, కౌటుంబిక, సామాజిక జీవితమును ఆరోగ్యకరము, సుఖవంతము, భద్రము చేసుకొనుటకు అత్యంత శాస్త్రీయముగా ధర్మార్థ కామ మోక్షములు అను చతుర్విధ పురుషార్థముల సాధనగా నిత్యజీవిత విధానమును సనాతన కాలము లోనే నిర్వచించి, నిర్ధారించినారు.

ఈ క్రమంలోనే ప్రకృతి విజ్ఞాన నిధులైన వేదముల ఆధారముగా, కావలసిన 'ప్రామాణిక' శాస్త్ర విజ్ఞానమునకై స్మృతులు, దర్శనములు, పురాణములు, ఇతిహాసములు, మొదలైన వేదవాఙ్మయమును అభివృద్ధి చేసుకొని, వాటి ఆధారముగా, సామాజిక పరిస్థితు లకు అనుకూలముగా, నిత్యజీవితములో చేయవలసిన దేవపితృ కార్యములు, కర్మలను (పూజలు, సంస్కారములు జరుపుటకు చేయు కర్మలు) వివరంగా చేయడం అందరికీ సాధ్యము కాదని, అవి చేసుకోవడంలో స్థూలంగా రెండు విధానములు ఆవిష్కరించినారు. వాటినే "వేదోక్తము", "పురాణోక్తము" అంటారు. చేసే కర్మలు ఒకటే అయినా, "చేసే" విధానం వేదోక్తంగా కానీ, పురాణోక్తంగా కానీ వుండవచ్చునని నిర్ణయించినారు.

పూజలు, కర్మలు చేయునప్పుడు ఎక్కువగా వేదమంత్రములు చదువుతూ వివరణాత్మక క్రియా విధానము పాటించడం వేదోక్తం. ఈ విధానములో కర్మలు చేయువారికి వేదములలో వున్న భాషా పరిజ్ఞానము, ప్రకృతికి సంబంధించిన విజ్ఞానము ఉండటం అవసరం. దేవాలయములలో అర్చనలు, వివిధ దేవతా సంబంధ పూజలు, హోమములు 'వేదోక్తం'గానే చేస్తారు. పూజలు, కర్మలు చేయునప్పుడు వేదమంత్రములకు పర్యాయముగా సరళ వ్యావ హారిక భాషలో, మంత్రములు, శ్లోకములు చదువుతూ, కర్మలు చేయువారికి, తాము చేయునది సులభముగా అర్థమయ్యే విధముగా క్లుప్త క్రియా విధానము పాటించడం పురాణోక్తము. ఈ విధానములో కర్మలు చేయువారికి పురాణములలో వున్న విజ్ఞానము తెలిసి వుంటే సరిపోతుంది.

సాధారణ కామ్యక కర్మలు, పూజలు, షోడశ కర్మలు ఉభయ (వేదోక్త, పురాణోక్త) విధానములలోనూ చేయవచ్చును.

# అంత్యేష్టి సంస్కారము

ఈ సంస్కారము ఎవరైనా (స్త్రీ కానీ పురుషుడు కానీ) మరణించినపుడు మరణించిన వ్యక్తి కొరకు జీవించి వున్న ఆ వ్యక్తి సంతానము, ఆత్మీయులు చేయునది.

ఏ ధర్మములో అయినా, ఏ మతములో అయినా, ఏ వర్ణమువారికైనా ఏదో ఒక విధముగా ఈ సంస్కారము తప్పకుండా చేస్తారు.

అన్ని సంస్కారములకు వలెనే ఈ సంస్కారమునకు ప్రాచీన కాలము నుండీ ఉపయోగించే మూలాధార విజ్ఞానము, ఆచరించు విధానములు – స్మృతులు, సూత్రములు, పురాణములు (మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి, బౌధాయన సూత్రములు, భరద్వాజ సూత్రములు, యల్లాజీయము, గరుడ పురాణము, హరివంశము) లలో వున్నవి.

## మానవ శరీరము : ఆత్మ – జీవుడు: ప్రాణోత్క్రమణము :

పంచభూతములుగా విశ్వవ్యాప్తమైన శక్తి, 'శరీరము' అనే 'రథము' కాగా, అందు చైతన్యమనే 'ఆత్మ', 'రథికుడి'గా శరీరములో వున్న పంచ ప్రాణములే ఆధారముగా "జీవిస్తూ" వుంటుంది. (ఉదా: కారు ప్రయాణములో 'కారు'–'శరీరము', 'డ్రైవర్'–'ఆత్మ' అనుకోవచ్చును)

ఆయువు తీరగానే ప్రాణములు శరీరమునుండి వెళ్ళిపోవడం ప్రాణోత్క్రమణం అంటారు. దీనినే మరణము అని కూడా అంటాము.

మరణము శరీరమునకు మాత్రమే. ప్రాణములు వదిలివేసిన పంచభూతాత్మక గర్భాధానమైన శరీరము, జీవించుటకు అనువైనది కాకపోవడం వలన అప్పటి వరకూ శరీరములో జీవించిన 'ఆత్మ' శరీరమును విడిచి, కర్మ సిద్ధాంతము ప్రకారము ప్రారబ్ధము ననుసరించి – 'కర్మ కారణ ఫలము' అనుభవించుటకు – మరో శరీరము తీసుకొనుటకు (జన్మకై) వెళ్లిపోతుంది.

ఆత్మ తనలో వుండి "జీవించినప్పుడు" చేసిన పుణ్య పాప కర్మలకు తాను 'మాధ్యమం' అయినందుకు, ఆయా కర్మలు "చేసిన" ఫలితము ("కర్మ కార్య ఫలము") అనుభవించుటకు శరీరశక్తి – పంచభూతములలో లయమయ్యే ప్రక్రియలో– యమ లోకము వైపు పయనిస్తుంది.

జీవించిన శరీరము కూడా ఒక శక్తి కనుక దానినే "జీవుడు" అంటారు.

గరుడ పురాణములో యమభటులు కొనిపోవునది శరీర శక్తి రూపమైన జీవుడిని ("ప్రేత"ను) అని స్పష్టముగా వున్నది.

అందువలననే అంత్యేష్టి కర్మలలో గానీ, తరువాత చేసే పితృ యజ్ఞములలో కానీ మరణించిన వ్యక్తిని ఉద్దేశించి 'ఆత్మ' శబ్దముతో సంబోధన వుండదు. ఈ కారణంగానే శరీరములో జీవించిన ఆత్మ వేరు, శరీరము వేరు, గా భావించడం సమంజసమే అవుతుంది. శరీరము, ఆత్మ వేరు వేరని, ఆత్మ, జన్మించి జీవించుటకు (కర్మ సిద్ధాంతం ప్రకారం, ప్రారబ్ధమును అనుభవించుటకు) శరీరము ఒక మాధ్యమమని శాస్త్రములన్నీ కూడా ఘోషిస్తున్నాయి.

## మానవ శరీరము - పంచ ప్రాణములు :

మానవ శరీరము పంచభూతాత్మికమై, సప్త ధాతువులచే నిర్మితమై, అందులో **ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అనే పంచ వాయువులు మరియు నాగ, కూర్మ, దేవదత్త, క్రకుర, ధనంజయ అనే పంచ ఉప వాయువులు,** పంచకోశములలో, చేతనావస్థలో "పంచ ప్రాణములు"గా వున్నంతవరకు శరీరము జీవించి (చేతనాస్థితి) వుంటుంది. పంచ భూత తత్వరూపమైన శరీరము ఒక "శక్తి" స్వరూపమే.

కారణం ఏదైనా, ఆయువు తీరగానే, పుట్టిన నాటి నుండీ శరీరమును ఆశ్రయించి వున్న పంచవాయువులు, వాటి వెనుకగా పంచ ఉపవాయువులు శరీరమును ప్రాణోత్క్రమణారంభం నుండి కొన్ని గంటలవ్యవధి లోనే, ఒక దాని వెనుక ఒకటి, ఒక క్రమంలో, వదలి వెళ్ళిపోతాయి. అన్ని వాయువులూ వెళ్ళిపోవడానికి కొంత సమయం పడుతుంది. అందుకే 'చని పోయారు', 'ప్రాణం పోయింది', 'ప్రాణాలు గాలిలో కలిసిపోయినవి' అనే మాటలు మరణమునకు పర్యాయముగా వాడుతారు. మరణము తరువాత శరీరమును ఒక కట్టెగా కూడా అభివర్ణిస్తారు.

ప్రాచీన శాస్త్రవేత్తలైన ఋషులు, వ్యక్తి మరణించు వరకు, జీవించుటకు మాధ్యమమైన శరీర శక్తి, మరణానంతరము పంచభూతములలో లయమయ్యే ప్రక్రియలో మరి కొంత కాలం అదృశ్య (కనపడని) శక్తి రూపముగా వుంటుందని తమ పరిశోధన మరియు అనుభవముల ద్వారా నిర్ధారించుకుని వుంటారు.

అందుకే, ఈ కాలంలో కూడా, చనిపోయిన వారితో సంభాషించవచ్చు అనే విశ్వాసాలు ఎన్నో దేశములలో వివిధ రకములుగా వున్నాయి.

## మరణానంతరము 'జీవుడు'-'ప్రేత', 'పితృ' రూపములు

జీవించి వున్నవారి కంటికి కనిపించే మృత శరీరమును వెంటనే ఖననం లేదా దహనం చేసినా, మరణించిన వ్యక్తి జీవించినప్పటి చేతనా శక్తి అదృశ్యమవుతుందే కానీ అది తిరిగి పంచ భూతములలో "లయ"మగుటకు కొంత సమయం పట్టడం శాస్త్రీయము మరియు సహజము.

పంచ భూతములలో 'లయ'మయ్యే స్థితిని 'అక్షయ పుణ్యలోక నివాసస్థితి'గా భావించి, అందుకొరకు, దగ్గరి సంబంధీకులు (సంతానము) మాత్రమే మరణించిన వ్యక్తి (అదృశ్యశక్తి) కి అక్షయ పుణ్య లోకములు చేరుటకు అవసరమైన సహకారం అందించవలసి వుంటుంది. ఈ సహకారమునే 'అంత్యేష్టి కర్మ కాండ', పితృయజ్ఞము అంటారు. ఇందులో భాగంగానే మరణదినం నుండీ 10 రోజుల పాటు, మరణించిన వ్యక్తి ని 'ప్రేత' రూపముగా సంబోధిస్తూ కర్మ కాండ నిర్వర్తిస్తారు.

మొదటి పది రోజుల తరువాత, మరణించిన వ్యక్తి జీవించిన ప్రభావము, వ్యక్తి సంబంధీకులకు సుమారు మూడు తరాల వరకూ జ్ఞాపకాలుగా ప్రభావితం చేస్తూనే వుంటాయని, అందువలన, మరణించిన వారి శరీర శక్తి, మూడు తరాల కాలము పితృ లోకము (అక్షయ పుణ్యలోకములు) లో మూడు రూపములలో వుండి క్రమంగా ప్రకృతిలో లయమవుతుంటారని, అందుకై, 11, 12వ రోజుల కర్మ కాండ, తరువాత సంవత్సర కాలములో చేయు మాసికములు, ప్రధమ సాంవత్సరీక కార్యక్రమములు, అనంతరం వివిధ శ్రాద్ధములు నిర్దేశించబడినవి.

పితృ కర్మలు చేయుటకు నిర్దేశించిన క్రియాకలాపము, చదివే మంత్రముల అర్థమును విశ్లేషించి అందులోని శాస్త్రీయతను అన్వయించుకున్నట్లైతే ఈ విషయమంతయు సులభం గానే గ్రహించ వచ్చును. మనిషి మరణించిన తరువాత, మరణించిన క్షణం నుండీ మృత వ్యక్తి అక్షయ పుణ్యలోకము చేరుటకు (పంచ భూతములలో "లయ" మగుటకు) వారి సంతానము, ఆత్మీయులు చేయు కర్మలన్నింటినీ "పైతృ మేధము", పితృ యజ్ఞము, పితృ కార్యములు అంటారు.

ఈ కర్మలలో భాగంగా మనిషి శరీరము అనే పంచ భూతాత్మిక శక్తి కి అంతిమంగా నిర్వర్తించు సంస్కారమే షోడశ సంస్కారములలో చివరిదైన అంత్యేష్టి సంస్కారము.

ఇది "వేదోక్త" లేదా "పురాణోక్త" విధానములలో చేయవచ్చును.

## అంత్యేష్టి – సామాజిక బాధ్యత

షోడశ సంస్కారములన్నీ సంఘజీవి అయిన మనిషి వ్యక్తిగత ఇహ–పర జీవన పురోభివృద్ధి లక్ష్యంగా ఏర్పరచ బడినా ఒక్క అంత్యేష్టి సంస్కారము మాత్రం ఒక సామాజిక బాధ్యతగా కూడా నిర్దేశించబడినది.

## ఈ విషయము నిర్ధారించు అంశములు :

1. ఎవరు మరణించినా, ప్రతి జీవించి వున్న వ్యక్తినీ మరణం కలవరపరుస్తుంది. మృత దేహము జీవన పరిసరములలో ఎక్కువ సమయము వుండకూడదు. ఉంచినట్లయితే, జీవించి వున్న వారందరి ఆరోగ్యమునకు హాని కలిగిస్తుంది. అందువలన మృతు లెవరైనా, జీవించివున్నప్పుడు సంఘములో ఏ స్థాయి లో జీవించిన వారైనా (రాజైనా, సేవకుడైనా, స్త్రీ అయినా, పురుషుడైనా), ఎంత దగ్గరి ఆత్మీయులైనా, ఎంత ప్రేమ వున్నా, మృత దేహమును పరిసరముల నుండి దూరంగా కొనిపోయి వదిలించుకోవడం తప్పనిసరి. అందుకే దగ్గరివారు, గ్రామస్తులు పాల్గొనే అంతిమ యాత్ర లేదా శవ యాత్ర వుంటుంది.

2. ఏ ఇతర సంస్కారముల విధి విధానములలోనూ, ఆరంభములోనే "పరిషత్తు" ను సంబోధించడం తప్పనిసరి కాదు. 'పరిషత్తు' అనగా సంఘములోని విజ్ఞులందరి సమావేశము. ఒక్క అంత్యేష్టి సంస్కారములోనే తప్పక పరిషత్తును సంబోధిస్తూ మరణించిన వ్యక్తి గురించి అందరికీ తెలియచెప్పుతూ అంత్యేష్టి సంస్కారము ఆరంభిస్తారు. (ఉపనయనము, వివాహము వంటి కొన్ని ముఖ్యమైన సంస్కారములలో సమాపనం – ముగింపు సమయం లోనే ఆశీర్వదించుటకు పరిషత్తు ను సంబోధిస్తారు).

3. ఇతర అన్ని సంస్కారములలో, బంధుమిత్రులను తమ ఆనందములో పాలుపంచుకోవడానికి ఆహ్వానించి ఆ సంతోష సమయములో వచ్చిన అందరినీ సంభావిస్తారు. కానీ అంత్యేష్టి సంస్కారములో జరిగే క్రియాకలాపముల స్థాయిలన్నింటి లోను, ఎంత విషాదములో వున్నా, దానములు, ప్రత్యేకముగా సంకల్పించి, ఇవ్వడం తప్పని సరి. దగ్గరివారు మరణించినపుడు శ్మశాన వైరాగ్యం రావడం సహజం. ఆ సమయములో మనిషి సంపాదించి కూడబెట్టుకున్నవాటిపై మమకారం నశిస్తుంది. ఇదే సరైన సమయమని కాబోలు అంత్యేష్టి సంస్కార క్రియలలో దానధర్మములకు ప్రాధాన్యమిచ్చి ప్రతి కుటుంబమూ సామాజిక బాధ్యత నిర్వర్తించే విధానం ఏర్పరిచినారు.

4. దానము ఇవ్వాలంటే, ముందు ఇచ్చేవాడి దగ్గర దాన వస్తువులు వుండాలి. మరణించిన వ్యక్తి తన జీవిత కాలములో తాను జీవించిన సంఘమునుండియే తనకున్నది కూడబెట్టి వుంటాడు కనుక, అందులో కొంత భాగమైనా, సంఘమునకు (అనగా సంఘములో అవసరమున్న వారికి) తిరిగి ఇచ్చివేయడమే అంత్యేష్టిలో దానములు చేయమని నిర్దేశించుటకు కారణము. దానము చేయవలసిన వస్తువులను నిర్ణయించడం లో కూడా ఈ ఉద్దేశ్యము అంతర్లీనంగా వుందన్నది సుస్పష్టము. ఎందుకనగా, తప్పక చేయవలసిన దశ దానములు - గో(సంపద), భూ, తిల, హిరణ్య (బంగారము), ఆజ్య (నెయ్యి), వాస (వస్త్ర), ధాన్య, గుడము, రౌప్యము (వెండి), లవణం, లోతుగా ఆలోచిస్తే ఇవన్నీ ప్రాచీన కాలములో ప్రతివారికీ అవసరాలు, ఏ ఇంటిలోనైనా కూడబెడితే మాత్రమే వుండేవి. షోడశ మహా దానాలలో కూడా నిర్దేశించిన వస్తువులు మానవ జీవితములో కూడబెట్టుకొని, వుంచుకోవలసిన నిత్యావసరములే.

మరణించిన వ్యక్తి కూడబెట్టి వదిలివెళ్లిన సంపద మొత్తమంతా వారసులు మాత్రమే అనుభవించడం సమాజ స్ఫూర్తికి విరుద్ధము అని ప్రాచీన సామాజిక శాస్త్రజ్ఞుల వాస్తవిక విశ్వాసము. ఆ సంప్రదాయము ప్రోత్సహిస్తే, సంపన్నుల వారసులు ఏమీ చేయని బద్ధకస్తులై సంఘానికి భారమవుతారని వారు అనుభవపూర్వకంగా తెలుసుకునే వుంటారు.

## అంత్యేష్టి-'మౌనము' ప్రాధాన్యత

"మౌనము" ప్రాణుల జీవనంలో ఒక అత్యంత ప్రధానమైన 'జీవప్రక్రియ'.

ఏ విషయమైనా అర్థం కావడానికి మౌనం చాలా అవసరం. ఏ పనినైనా జాగ్రత్తగా మనసుపెట్టి చేయాలంటే మౌనం పాటించవలసినదే. సంఘ జీవి అయిన మానవుడికి తోటి వ్యక్తి మరణించినపుడు ఆ విషాద స్థితిని అర్థం చేసుకోవడానికి, తరువాత చేయవలసిన పనులు చేయడానికి మౌనము గా వుండటం చాలా అవసరము.

అందుకే ప్రపంచమంతటా, ఏ ధర్మం లో అయినా, ఏ మతం లో అయినా, సంతాపం ప్రకటించడానికి ఔపచారికము గానే అయినా 2 నిమిషాల మౌనం పాటిస్తూ వుంటారు. అంత్యేష్టి సంస్కార విషయములో, ఏ నాగరికతలో అయినా, మౌనానికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వబడింది. ఏ మతము వారైనా ఏదో ఒక విధంగా మౌనం తప్పకుండా పాటిస్తారు.

సనాతనధర్మంలో కూడా అంత్యేష్టి సంస్కారమంతా విధిగా మౌనంగానే చేయాలి.

అయితే ఆటవిక జీవన విధానములో జీవించే కాలములో, దూరంగా వున్న వారికి మరణ వార్త తెలియజేయాలని, శవానికి అంతిమ సంస్కారం చేయడానికి తీసుకు వెళుతున్నపుడు, ప్రత్యేక ధ్వని తో 'చావు డప్పు'లు వాయించే వారు.

ప్రేతకు సంబంధించిన కార్యక్రమములలో మరియు శ్రాద్ధములలో ఎలాంటి చప్పుడూ చేయకూడదని నేటి కాలములో కూడా చెప్పడం గమనిస్తూనే వుంటాము.

## అంత్యేష్టి ఆచరణ - కర్తృత్వ అధికారము

మరణించిన మనిషి కి (స్త్రీ అయినా పురుషుడైనా) "వారసులు" (సాధారణంగా సంతానము) అంత్యేష్టి సంస్కారము తప్పకుండా చేయడం ధార్మిక మరియు సాంఘిక కర్తవ్యము. దీనివలన మరణించిన వ్యక్తికి (ప్రేతకు) పితృ లోకములో పితృ (వసు) రూపము పొందుటకు పూర్తిగా సహకరించినట్లవుతుంది.

అంత్యేష్టి కార్యక్రమమును ఆచరించే వారిని "యజమాని" లేదా "కర్త" అంటారు. మరణించినవారికి వున్న పుత్ర సంతానం అందరూ కర్తలు అవుతారు. పుత్రులు లేనట్లయితే కూతురు కొడుకుల (దౌహిత్రులు) లో జ్యేష్ఠుడు కర్త కావడానికి అర్హుడవుతాడు. పుత్రులు, దౌహిత్రులు లేనప్పుడు కర్తృత్వ అధికారము జ్ఞాతులకు వుంటుంది. మరణించినవారితో రక్త సంబంధము లేదా అత్యంత సమీప బంధుత్వము కర్తృత్వ అధికార నిర్ణయమునకు ఆధారంగా గ్రహించడం ధర్మ శాస్త్రముల ఉద్దేశ్యము గా గ్రహించవచ్చును. కర్తృత్వ అధికారమున్నవారు కార్యక్రమం చేయడానికి సశక్తులై కూడా వుండాలి.

మరణించిన వారికి పుత్రులు/ దౌహిత్రులు లేకుండా కేవలం స్త్రీ సంతానం వున్నట్లైతే లేదా నిస్సంతులైనా స్త్రీకి భర్త స్వయముగా, పురుషుడికి అతని భార్య - తన "ప్రతినిధి కర్త" ద్వారా (కర్తృత్వబాధ్యత నిచ్చి) అంత్యేష్టి కార్యము నిర్వర్తించాలి.

మరణించిన వారికి వారసులు వుండి అశక్తులైతే లేదా వారసులు లేనట్లయితే ఇతరులైనా అంత్యేష్టి సంస్కారము చేయవచ్చును. మరణించిన ప్రతి మనిషికీ పితృలోక ప్రాప్తి కలిగేలా అంత్యేష్టి సంస్కారం నిర్వహించడం, తోటి మనుషుల 'ధార్మిక బాధ్యత' గా గుర్తించాలని ఋషుల మౌలిక ఉద్దేశ్యము. అందుకే అనాధ ప్రేత సంస్కారము చేసినట్లైతే, కోటి యజ్ఞములు చేసిన ఫలితం కలుగును అనే పెద్దల మాట వచ్చింది. ఇక్కడ అనాధ అనగా అర్హులైన కర్తలు ఎవరూ లేనప్పుడు అని కూడా గ్రహించాలి.

పుత్రులు, దౌహిత్రులు లేక ఇతరులు కర్తృత్వము పొందినపుడు వారికి ఆశౌచము,

సంవత్సర సూతకము వంటి బాధ్యతలు కార్యక్రమము చేయునంతవరకే తాత్కాలికంగా వుంటాయి. ఏకభుక్తము, భూశయనము, గ్రామాంతర ప్రయాణము మొదలైన విషయము లలో వుండే నియమములు యధా యోగ్యముగా పరిమితంగానే పాటించ వచ్చును.

## అంత్యేష్టి ఆచరణ - స్త్రీలకు కర్తృత్వ అధికారము

సనాతన ధర్మములో చాలా లోతైన పరిశోధనలు, కలిగిన అనుభవాలు ఆధారంగా ఋషులు స్త్రీ పురుష భేదమును స్పష్టముగా గ్రహించి సామాజిక జీవనంలో (అనగా ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సాధనలో) వారికి వేరు వేరు బాధ్యతలు నిర్దేశించినారు. స్త్రీని అన్ని విధాలుగా భరించు బాధ్యత పురుషులకు, పురుషుల ధర్మాచరణలో సంపూర్ణ సహకారము అందించు బాధ్యత స్త్రీలకు నిర్ణయించినారు. ఇంతేకాకుండా, పురుషులకు వర్తించని రుతుక్రమం, గర్భధారణ వంటి ప్రత్యేక శరీర ధర్మములు, శైశవం లో సంతాన పరిరక్షణ అవకాశము/ బాధ్యత స్త్రీలకు మాత్రమే వున్నాయి. ఇవి సామాజిక ధర్మాచరణలో (వారి ఆరోగ్యము మరియు సౌకర్యముల విషయంగా) ఆటంకము కలిగిస్తాయి. ఈ కారణంగానే అనివార్యమైన పరిస్థితులలో, ప్రత్యామ్నాయముగా స్త్రీలకు కర్తృత్వ ప్రతినిధి ద్వారా అంత్యేష్టి, పితృయజ్ఞముల నిర్వహణకు అనుమతించినారు. స్త్రీలు స్వయముగా అంత్యేష్టి మరియు పితృ యజ్ఞము చేయుటను అనుమతించలేదు.

అయితే నేటి కాలములో అన్ని విషయములలోనూ స్త్రీ పురుషులు స్వతంత్రులుగా వ్యవహరిస్తూ, కుటుంబ అనుబంధాలకన్నా స్వాభిమాన భావనలకు ప్రాధాన్యత యిచ్చే సామాజిక జీవన విధానం సర్వ సాధారణమైనది. ధర్మాచరణకు మూలాధారమైన కుటుంబ వ్యవస్థ రూపురేఖలు పెను మార్పు కు లోనయ్యాయి. ఈ కారణంగానే కేవలం కూతుళ్లు మాత్రమే వున్న తలిదండ్రుల కు కర్తృత్వ ప్రతినిధి ద్వారా కాకుండా కూతుళ్లు స్వయముగా అంత్యేష్టి చేసే సంఘటనలు జరుగుతున్నాయి.

ఒకే కొడుకు వున్న దంపతుల సంతానం లేని కోడలు, అత్తమామలు మరణిస్తే స్వయముగా అంత్యేష్టి కర్తృత్వము నిర్వహించే విధానము/ కాలము వచ్చినా ఆశ్చర్యపడనవసరము లేదు.

కాలానుగుణంగా ధర్మాచరణ సూత్రములు సంస్కరించుకోవలసిన సమయం వచ్చింది.

అంతిమ ప్రత్యామ్నాయముగా, శరీర ధర్మాలు అనుకూలిస్తే, స్త్రీలకు కూడా కర్తృత్వ

ప్రతినిధి ద్వారా కాకుండా స్వయంగానే అంత్యేష్టి, పితృయజ్ఞముల కర్తృత్వ నిర్వహణాధికారం ఉన్నట్లుగానే భావించవచ్చును.

## కర్తలకు వపనము

వాస్తవంగా ఆలోచిస్తే 'కర్త/లకు వపనము' ఆటవిక జీవన విధానపు అవసరము. ఆ కాలములో క్రమంగా జుట్టు కత్తిరించు కునేవారు కాదు. ఇంటిలో వ్యక్తి చనిపోయినప్పుడు విషాదం లో వున్నపుడు చిందరవందరగా జుట్టు వుండే అవకాశం వుంటుంది. మరొక కోణములో ప్రేత శక్తి తో సంబంధం వస్తున్నపుడు శరీరముపై వెంట్రుకలు ఉండకూడదని కూడా అయి ఉంటుంది.

వపనం గురించిన మంత్రముల ప్రకారం ఇది ఒక శరీర శుద్ధి సంస్కారము గానే భావిస్తారు.

**మేరు మందర తుల్యాని పాపానిసు బహూనిచ ।**
**కేశానాశ్రిత్యతిష్ఠన్తి తస్మాత్కేశాన్వపామ్యహం ॥**

మేరు మందర పర్వత సమానమైన పాపములెన్నో వెంట్రుకలనాశ్రయించి వుండినట్లైతే వాటి నాశనము కొరకు వపనము చేయించుకుంటున్నాను (పురాణోక్త అపరచంద్రిక)

**గంగాయాం భాస్కర క్షేత్రే మాతా పిత్రోర్గురోర్మృతౌ ।**
**ఆధానే యజ్ఞ కాలేచ వపనం సప్త సుస్మృతం ॥**

గంగాది నదులయందును, భాస్కరాది పుణ్య క్షేత్రములయందును మాతా పితృ గురువుల యొక్క మరణము నందును, ఆధానము నందును యజ్ఞ కాలమునందును వపనము చేయించుకొనవలయును. (యాజుషాపర ప్రయోగానుక్రమణిక)

# అంత్యేష్టి - మొదటి దశ (ఖననము / దహనము)

✤ ఒక మనిషి చనిపోయినప్పుడు ఆ మనిషి శరీరమును (పార్థివ దేహమును) జన జీవన పరిసరముల నుండి దూరంగా, ఆ పరిసరములలో జీవించి వున్నవారి ఆరోగ్య మునకు హాని కారకము కాకుండా, అత్యంత క్రమపద్ధతి పాటిస్తూ, శ్రద్ధగా తీసుకొని వెళ్లి, దానిని ప్రకృతికి తిరిగి అప్పగించడం - అంత్యేష్టి సంస్కారము చేయడంలో మొదటి దశగా చెప్పుకోవచ్చును. మరణించిన వ్యక్తి పట్ల అత్యంత గౌరవము, ఆదరణ ప్రకటిస్తూ, వ్యక్తి మరణానంతరము, సంఘ జీవన నియమాలకు అనుగుణంగా పరిసరములను పరిశుభ్రము చేసుకొనుటయే ఈ సంస్కారము ముఖ్య ఉద్దేశ్యము.

✤ పంచ భూతములు ప్రకృతి శక్తులు. ప్రాణులన్నీ కూడా పంచ భూతాత్మికములే.

✤ చరిత్ర పుటలు తిరగేస్తే, పూర్వ కాలములో, వారి వారి ప్రాదేశిక స్థితులను బట్టి పార్థివ శరీరమును 4 విధములుగా పంచభూతములకు తిరిగి చేర్చే ఆచారము లుండేవని గ్రహించవచ్చును. అవి:

1. మట్టిలో పూడ్చడం - ఖననము (భూమి)
2. నదులలో వదిలివేయడం (జలము)
3. అగ్ని లో దహించడం - దహనము (అగ్ని)
4. ఎత్తైన ప్రదేశములలో వదిలివేయడం (వాయు)

✤ కాలక్రమంలో, ఖననం కారణంగా శ్మశాన భూమి విస్తీర్ణం పెరిగి ఆ ప్రదేశము నిరుపయోగ మవుతుందని గ్రహించారు. అలాగే, నదుల తీరాలలోనే జనావాసాలు ఉండేవి కనుక పార్థివ శరీరములు వదలడం వలన నదీ జలాలు కలుషితమై పర్యావరణం కలుషితమవుతుందని తెలుసుకున్నారు. దహనము చేసే విధానములో భూమి ఉపయోగము పరిమితమవుతుందని, ఈ విధానము ఉత్తమమని భావించారు. ఎత్తైన ప్రదేశములలో పార్థివ శరీరములను వదిలివేయడం వలన కూడా పర్యావ రణము కలుషిత మవుతుందని తెలుసుకున్నారు. ఈ నేపథ్యముతోనే, భారతీయ సంప్రదాయములో మృత దేహమును దహనము చేసే విధానానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడినది. అందుకే "దహన సంస్కారము" అనే మాట కూడా వచ్చింది.

## పార్థివ దేహ 'పరిశుద్ధి'-'సర్వ ప్రాయశ్చిత్తము'

✤ ఒక వ్యక్తి మరణించగానే దగ్గరివారు ముందుగా మరణ నిర్ధారణ చేసు కొంటారు. మృత శరీరము కూడా ఒక శక్తి కనుక, భూ గోళపు భూమధ్య రేఖ నుండి ఉత్తర దక్షిణ ధ్రువములు విద్యుదయస్కాంత శక్తి కేంద్రములు కనుక భూమిపై శరీరము తలను దక్షిణము వైపు వుంచి పరుండబెడతారు. భూగోళము పై భారత దేశముతో సహా ఎక్కువ భూభాగము ఉత్తరార్ధ గోళము నందున్నది కాబట్టి మృత శరీరము తల దక్షిణము వైపు ఉంచుతారు.

(దైనందిన జీవితములో నిద్రించునపుడు కూడా తలను దక్షిణమువైపు వుంచాలని శాస్త్ర వచనము).

✤ శరీరమును ఖననము లేదా దహనము చేయుటకు స్థానిక స్థితులు, వసతులను బట్టి నిర్ణయించి ఖననము లేదా దహనము చేయు స్థలము నిర్ణయించి, గుర్తించుటకు అంత్యేష్టి చేయు కర్తను (సాధారణంగా కొడుకు) ఒక సారి ఆ స్థలమును చూసి రావడానికి ఏర్పాటు చేస్తారు. దీనినే కొన్ని ప్రాంతాలలో 'కట్టె వేసి రావడం' అనే ఆచారంగా పాటిస్తారు. అంతిమ సంస్కారము చేయతలపెట్టిన స్థలమును అంత్యేష్టి చేయు కర్త చూసి వచ్చిన తరువాత మృత దేహమును ప్రకృతి శక్తులను స్మరిస్తూ శుద్ధి చేస్తారు. ఆ క్రమంలో దేహమునకు 'సర్వ ప్రాయశ్చిత్తము' ప్రకటిస్తారు. జీవించి వున్నప్పుడు మరణించిన వ్యక్తి (స్త్రీ కానీ, పురుషుడు కానీ) తాను పుట్టిన క్షణం నుండీ మరణించిన క్షణం వరకూ వ్యక్తిగతముగా, సంఘ జీవిగా ఏమేమి తప్పులు (పాపములు) చేయడానికి అవకాశం వున్నదో అవన్నీ తెలిసి కానీ, తెలియక కానీ చేసివున్నట్లైతే మన్నించమని పరిషత్తును వేడుకుంటారు. దీనినే సర్వ ప్రాయశ్చిత్త విధి అంటారు. దేహమును తరలించుటకు ముందు వివిధ దానములు సంకల్పిస్తారు.

✤ పార్థివ దేహమును అంతిమ సంస్కారము కొరకు శ్రద్ధగా తీసుకొని పోవుటకు దగ్గరి వారిని శవ వాహకులుగా నిమంత్రించి, బంధువులు, స్నేహితులు అందరూ శ్మశానమునకు ఎంతో జాగ్రత్తగా, సగౌరవంగా తీసుకొని వెళతారు. ఆ నాటి కాలములో వున్న విజ్ఞాన స్థాయిని బట్టి మరణమును పరిపూర్ణముగా నిర్ధారించు కోవడానికి మూడు సార్లు మధ్యలో పార్థివ శరీరమును త్రోవ లోనే క్రింద పరుండబెట్టి మళ్ళీ మళ్ళీ పరిశీలిస్తారు. (ఈ ప్రక్రియను 'దింపుడు కళ్ళం' అని కొన్ని ప్రాంతము లలో వ్యవహరిస్తారు). అంతిమంగా శ్మశానంలో అంత్యక్రియలు (ఖననము/ దహనము) నిర్వహిస్తారు.

## దహన సంస్కారము-కపాలమోక్షము

- పార్థివ శరీరమునకు దహన సంస్కారము చేసినప్పుడు పార్థివ శరీరము సంపూర్ణముగా అగ్నికి ఆహుతి అయిందన్న విషయం ధృవీకరించుకోవడానికి 'కపాల మోక్షము' అయ్యేంతవరకు వేచి వుంటారు. ఈ విషయములో పూర్వీకులకు మానవ శరీర సంబంధ విజ్ఞానము ఆ కాలములోనే ఎంత లోతుగా వుండేదని ఆశ్చర్యం కలుగుతుంది.

- మనిషి శరీరములో కపాలమే దృఢమైన ఎముక. దహనము కారణంగా ఆ ఎముక పగిలినప్పుడు, దహన సంస్కార ప్రక్రియ పూర్తయినట్టుగా భావించ వచ్చును. అందువల్లనే మృత శరీరము పరిపూర్ణముగా దహనం అయినట్లు నిర్ధారించు కోవడానికి కపాల మోక్షము జరిగిన తరువాతనే అంతిమ సంస్కారం పూర్తయినట్లు భావిస్తారు. శరీరమును ఖననం చేసినప్పుడు ఇది వర్తించదు.

## అస్థి సంచయనము, అస్థి నిక్షేపణము

- పార్థివ శరీరమునకు దహన సంస్కారము చేసినప్పుడు, దహనము చేసిన ప్రాంతమును తిరిగి శుద్ధి చేయడం మరియు దహనానంతరం మృత దేహపు అవశేషములు ఏమైనా ఉంటే వాటిని అక్కడినుండి తీసి వేయడం సామాజిక బాధ్యత మరియు సంఘజీవన నియమము. అందుకే, 'దహనము' కాని అస్థికలను 'ఏరి' (సంచయనం చేసి) వాటిని సాధారణ జీవన పరిసరాలకు దూరంగా, పరిసరాలు కాలుష్యం కాకుండా, సముద్రాలను చేరుతాయని, పెద్ద పెద్ద జీవ నదులలో 'నిక్షిప్తం' చేయడం ఆచారమైనది. చితా'భస్మము' నదులలో కలపడమనే భావన శాస్త్రములో లేదు.

- ఈ కార్యక్రమం వీలైనంత త్వరగా చేయవలసినది కనుక సాధారణంగా మొదటి పది రోజులలోనే చేస్తారు. వారి ప్రదేశమునకు దూరంగా వుండే పెద్ద జీవ నదులదాకా వెళ్లాలనుకొని, వెంటనే వెళ్లే వీలు లేనప్పుడు, 'అస్థి సంచయనం' మాత్రం పూర్తి చేసి, 'అస్థి నిక్షేపణం' వీలును బట్టి చేస్తారు.

- అస్థి నిక్షేపణం, దహనం తర్వాత సూర్య లేదా చంద్ర గ్రహణం వచ్చే లోగా చేయాలని కాలావధి కూడా నిర్దేశించబడినది.

## అంత్యేష్టి - రెండవ దశ : 12 రోజుల కర్మకాండ

## ప్రేత స్మృతి - మరణానంతర తాపోపశమన ప్రక్రియ - దశ దిన కర్మకాండ, దశాహం :

- సంఘ జీవి అయిన మానవుడు కుటుంబ వ్యవస్థ ఏర్పరుచుకున్నందున, కుటుంబములో ఎవరైనా మరణించినపుడు కుటుంబ సభ్యులందరు మరియు మరణించిన వ్యక్తి జీవించిన వీధి/ గ్రామము/ బంధు వర్గము వారందరు కూడా ఆ మరణమును పూడ్చలేని వెలితిగా భావిస్తారు. సహజంగానే రోదిస్తారు. తిరిగి సాధారణ స్థితి పొందడానికి కొంత కాలం పడుతుంది. మరణం సంభవించిన మొదటి రోజు నుండీ కనీసము 10 పగళ్లు (దినములు లేదా దివసములు) గడిస్తే కానీ "స్థిమిత పడే" అవకాశం ఉంటుంది. అందువలన మొదటి పది రోజులూ మరణించినవారి స్మరణతో ఇంటిలో సాధారణ పరిస్థితి నెలకొనడానికి, దగ్గరి బంధువులు సహాయపడతారు. ఈ దశాహ కాలమును మరణించిన వారి కుటుంబీకులకు 'మృతాశౌచ' కాలము ('సుష్టి' లేదా 'మైల' అని కూడా) అంటారు. ఇలాంటి ప్రత్యేక స్థితి, కుటుంబములో శిశువు జన్మించినపుడు కూడా వుంటుంది. అప్పుడు కూడా కుటుంబములోని వారు 10 రోజులు "పురుడు" అని వ్యవహరించ బడే "జాతాశౌచము" పాటించవలసి వుంటుంది.
- మనిషి జన్మించడానికి ముందు తల్లి కడుపులో సాధారణంగా పిండ రూపము నుండి శిశువుగా మార్పు చెందే కాలము 10 నెలలు కనుక పుట్టినప్పుడు కానీ, మరణించినప్పుడు కానీ 10 రోజుల ఆశౌచ కాలము నిర్ణయించబడి వుంటుంది.
- కాల గణనలో ప్రాథమిక కొలమానం "ఒక రోజు" (ఒక భూమి భ్రమణం-అహోరాత్రము). తరువాత కొలమానం "ఒక నెల" (చంద్రుడు భూమి చుట్టూ చేసే ఒక పరిభ్రమణం). ఒక నెల, కాలవృత్తము అనుకుంటే, ఒక నెలలో 10 రోజులు, మూడోవంతుకు, అనగా వృత్తములో 120 డిగ్రీలకు, లేదా రాశి చక్రపు ఒక నవకములో చంద్ర సంచారమునకు సమానం అన్న విషయం అన్వయించు కుంటే, ఋషులు జ్యోతిష శాస్త్ర విజ్ఞానముతో, ఎంత లోతుగా ఆలోచించి 'దశాహం' భావన నిశ్చయించారో అని ఆశ్చర్యం కలుగుతుంది. మరణదినము నాటి నుండి 9 నక్షత్రాలలో (ఒక నవకములో) చంద్ర సంచారం దాదాపు 10 పగళ్ళలో

పూర్తవుతుంది. మరునాటి నుండి (11వ రోజు) రెండవ నవకం లో చంద్ర సంచారం వుంటుంది.

- కుటుంబములో ఒక వ్యక్తి మరణించినపుడు, చనిపోయినవారి కుటుంబ సభ్యులు, ఆత్మీయులు, ఆ కారణంగా ఏర్పడిన దుస్థితిని భౌతికంగా తట్టుకొని నిత్య జీవితంలో తిరిగి కుదుటపడే విధానం నిర్దేశిస్తూనే, మరణించిన వ్యక్తికి మరణానంతరం ఏర్పడిన స్థితి గురించి కూడా లోతైన పరిశోధన చేసిన ఋషులు, అత్యంత శాస్త్రీయముగా ప్రకృతితో సమన్వయ విధానము కనుగొని నిర్దేశించినారు. ఈ విధానమునే "కర్మకాండ" అంటారు.

- మరణించిన వ్యక్తి కూడా పంచభూతాత్మిక స్థితి లోనే వుంటాడని, ఆ స్థితిని "ప్రేత" అని సంభోదించాలని నిర్ణయించినారు. మరణించిన తరువాత ప్రేతకు, జీవించి వున్నప్పటి వలెనే, మరణం కారణంగా, (శరీరాన్ని దహనం చేసి ఉంటే దహనం కారణంగా) – మండిన బాధ, ఆకలి బాధ (క్షుధా), దప్పిక బాధ (తృష్ణ) వుంటాయని, ప్రేతకు వాటి నుండి ఉపశమనం పొందుటకు మరియు పోగొట్టుకున్న పంచ ప్రాణములను కూడ గట్టుకొని, తనకొరకు పంచభూతములు సహజంగానే ఏర్పాటు చేసే "సూక్ష్మ శరీర" నిర్మాణం పూర్తయ్యేంతవరకు, జీవించి వున్నదగ్గరి బంధువులు సహకారం అందించాలని, అందుకై "దశ దిన కర్మకాండ" విధానము ఏర్పరిచినారు.

- సమాజ ధర్మం అనుసరించి, ప్రేతకు కర్మకాండ జరపడానికి, ప్రేత వారసులకే బాధ్యత మరియు శ్రద్ధ వుంటాయి. ప్రేతకు కర్మకాండ చేయువారు సాధారణంగా (పితృ స్వామ్య సమాజం కనుక) పుత్రులు అవుతారు. వారిని కర్త/లు అంటారు. అందుకే మొదటి 10 రోజులలో వరుసగా కానీ (నిత్యకర్మ), మొత్తం 10 రోజులలో చేయవలసింది చివరి రెండు రోజులలో (9,10) కానీ, లేదా 10వ రోజు లోపల, తమకున్న అనుకూలతను బట్టి ఏదో ఒక రోజు నుండి ఆరంభించి కానీ, ప్రేత స్మృతి లో దశదిన కర్మ కాండ చేస్తారు. జీవించి వున్నవారికి అర్థం కావడానికి ఈ పది రోజులలో ప్రేత కు ఏర్పడే సూక్ష్మ శరీరాంగములు ఏ రోజు కు ఏ ఏ అంగములు ఏర్పడుతాయో క్రింది విధముగా సూచించారు.

- **ప్రథమ దినే మూర్ధాక్షి దంతావయవ సంభూతి** (మాడు, దంతములు)
- **ద్వితీయ దినే చక్షుశ్శోత్ర నాసా ముఖావయవ నిష్పత్తి** (కళ్ళు, చెవులు, ముక్కు ముఖము)

- **తృతీయ దినే కరాంసభుజ నక్షో నిష్పత్తి** (భుజములతో చేతులు)
- **చతుర్థ దినే నాభి లింగ గుద నిష్పత్తి** (నాభి, లింగ, గుదములు)
- **పంచమ జాను జంఘ పాదావయవసిద్ధి** (నడుము, తొడలు, పాదములు)
- **షష్ఠమ దినే సర్వ మర్మావయవ నిష్పత్తి** (అన్ని అంగములు)
- **సప్తమ దినే మజ్జా మేధో మాంస స్నాయునాడీ రూప అవయవ సంభూతి** (మజ్జ, మేధస్సు, మాంస నాడీవ్యవస్థ)
- **అష్టమ దినే దంత లోమ నఖావయవ సిద్ధి** (దంతములు, గోళ్లు)
- **నవమ దినే వీర్యావయవ సిద్ధి** (హార్మోనులు, వీర్యము)
- **దశమ దినే దేహ పూర్ణత్వ తృప్తి** (సంపూర్ణ దేహము)

ఊర్ధ్వ లోకములకు వెళ్ళడానికి అనువుగా ఏర్పడే ఈ సూక్ష్మ శరీరము 'ఔర్ధ్వ దేహము' గా గరుడ పురాణములో చెప్పబడినది. ఇదంతా మానవ నేత్ర దృష్టికి అందని ప్రక్రియ.

## మరణానంతరము - పంచ ప్రాణముల సంచారము

- మానవ శరీరమును ఆశ్రయించి వున్న పంచ ప్రాణములు శరీరమును విడిచి వెళ్ళినపుడు మరణం సంభవిస్తుంది. అయితే ఇవి వెంటనే గాలిలో కలిసిపోలేక మరణం నాటి నుండి మొదటి 10 రోజుల పాటు మరణించిన వ్యక్తి శరీర సంబంధ ప్రదేశములలో, క్రింద ఇచ్చిన విధంగా, సంచరిస్తూ వుంటాయి.

1. మృతుడు సాధారణంగా నివసించిన ప్రదేశము (గృహము)
2. ప్రాణోత్క్రమణ సమయం లో శరీరమున్న ప్రదేశము (మృత స్థలము)
3. అంత్యక్రియలు నిర్వర్తించే కర్త యందు (కర్త/లు)
4. అంత్యక్రియలు చేసిన ప్రదేశము (శ్మశానము - రుద్రభూమి)
5. వాయు మరియు జల చరముల యందు (వాయస, గృధ్ర, జల చర)

ఈ స్థానముల యందు మొదటి 10 రోజులు ప్రేత పేరు చెప్పి పిండములు వుంచడం గమనిస్తూనే వుంటాము.

## శిలా ప్రతిష్ఠ - శిలోద్వాసన

అంత్యక్రియలు చేసిన ప్రదేశములో వుండు ప్రాణమును అస్థి సంచయనము చేసిన పిదప ఒక శిల మీదకు ఆవాహన చేసి ఆ శిలకు పది రోజులపాటు తిలోదక, వాసోదక, మృత్తికాస్నాన, పిండదానములతో మరణానంతర బాధలకు ఉపశమనం కలిగిస్తారు. ఆ క్రమంలోనే పక్షి కి కూడా అన్నం పెడతారు. ఆ శిలను బయటి ప్రదేశములోనే లేదా శ్మశాన ప్రాంగణములోనే వుంచుతారు.

వారి వారి కులాచారము ననుసరించి మృతుడి గృహము/ మృత స్థలము యందు కూడా 10 రోజులు పిండమును వుంచుతారు.

✤ ఇలా శరీరమును వదిలిన పంచ ప్రాణములు 10 రోజుల పాటు చేసే కర్మ కాండ వలన ఉపశమనం పొంది, పది రోజుల పిదప ప్రేతకు ఔర్ధ్వ దేహము ఏర్పడుతుంది కనుక అందులో ప్రవేశిస్తాయి. అవి, పంచ భూతములలో లయమయ్యే ప్రక్రియలో భాగంగా, భూవాతావరణ స్థాయికి పైన వుండే పితృ లోక ప్రయాణము చేయుటకు వీలు కలుగుతుంది. ప్రేతకు పృధ్వీ తత్వమునుండి విముక్తి లభిస్తుంది.

✤ అందుకే 10వ నాడు శిలోద్వాసన అనే ప్రక్రియ తో సూక్ష్మ శరీరములో ప్రవేశించి పితృలోక ప్రయాణమునకు సిద్ధమైన ప్రేతకు వీడ్కోలు పలికే ప్రక్రియ లో భాగంగా దగ్గరి వారు మరియు తెలిసిన వారందరూ 10వ రోజున, ప్రేతకు 'తిలోదకాలు', 'ధర్మోదకాలు' సమర్పిస్తారు. (ఆపః)

✤ మృత దేహమును ఖననం చేసినట్లైతే పది రోజుల కర్మ కాండ కేవలం ఖనన ప్రదేశంలో మరియు వాయు/జలచరములకు పిండం పెట్టడం వరకే పరిమిత మవుతుంది. శిలా ప్రతిష్ఠ, శిలోద్వాసన, తిలోదక ధర్మోదకాదులు వుండవు.

✤ మృత శరీరమును ఖననము చేసినా లేదా దహనము చేసినా, మరణానం తరము మొదటి 10 రోజులు గడచిన తరువాత ప్రేతకు సూక్ష్మ శరీరం లభించి పృధ్వీ తత్వము నుండి విముక్తి పొందుతుంది కనుక, జ్ఞాతులందరికీ పది రోజుల ఆశౌచము పూర్తవుతుంది. కర్మకాండ చేయు కర్త/లకు (దంపతులకు) మాత్రం, ప్రేత, పితృ లోకము చేరుటకు చేయు కర్మకాండ పూర్తయ్యేవరకు (అనగా 12 వ రోజు సపిండీకరణము చేయు వరకు) మృతాశౌచము వుంటుంది.

## ప్రేత, పితృలోక ప్రయాణ ప్రక్రియ-ఏకాదశాహం (11వ రోజు)

- ప్రేత, పితృలోక ప్రయాణము చేయుటకు సహకరించడానికి కావలసిన దైవ శక్తులు (రుద్రగణములు, వసుగణములు) ప్రత్యేకముగా ఉంటాయి. కర్త/లు వాటిని కూడా ఆహ్వానించి మర్త్యలోకమున తమతో జీవించి మరణించిన ప్రేతకు, పితృలోక ప్రయాణమునకు సహకరించవలసినదిగా ప్రార్థిస్తారు. ప్రేతకు, మరియు ఆహ్వానించిన దైవశక్తులకు కూడా తృప్తి కలుగుటకు 11 వ రోజున ఏకోద్దిష్టం, వృషోత్సర్గము (వృషోత్సర్జనం), షోడశం అనే శ్రాద్ధములు జరుపుతారు.

## సపిండీకరణం-ప్రేతకు ప్రేతరూప విముక్తి - పితృలోక ప్రాప్తి, స్వర్గపాథేయము-ద్వాదశాహం :

- మరణదినం మొదలుగా 12వ నాడు వసు రుద్ర గణముల సహాయముతో పితృలోకము చేరిన ప్రేతకు ఆ లోకములో అప్పటికే అక్కడ ప్రేత సంబంధీకులైన పితరులు, వసు-రుద్ర-ఆదిత్య రూపములతో మూడు స్థాయిలలో వుంటారు.
- పితృ లోకములో ఎల్లప్పుడూ వుండే పితరులు ఈ మూడు స్థాయిలలో మాత్రమే వుంటారు. ఈ మూడు స్థాయిలలో ప్రాచీన పితరుల రూపం ఆదిత్య రూపము. దీనినే కర్త/ల యొక్క "వృద్ధ ప్రపితామహ/మహి" స్థానము అంటారు.

  **వసూన్ వదన్తి పితౄన్ రుద్రాంశ్చైవ పితామహాన్ ।**
  **ప్రపితామహాం స్తథాదిత్యాన్ శ్రుతిరేషా సనాతనీ ॥** (మనుస్మృతి, 3-284)

  శ్రాద్ధంలో పితరులు వసువులని, పితామహులు రుద్రులని, ప్రపితామహులు ఆదిత్యులని వేదములు చెపుతున్నాయి

- ప్రేత, పితృలోకములో స్థిరపడటానికి ఈ మూడు రూపములలో వున్న పితరులు తమ స్థానములను (రూపములను) 'ముందుది ముందుకు' క్రమములో మార్చుకొని, ప్రేతకు "పితృ" స్థాయిని, వసు రూపమును ఇస్తారు. ఈ ప్రక్రియను భూమి పై కర్త /లు "సపిండీకరణము" (ఉదక సంయోజనం, పిండ సంయోజనం) అనే శ్రాద్ధ ప్రక్రియ ద్వారా నిర్వర్తిస్తారు.
- ప్రేత, పితృలోకము చేరువరకూ అక్కడ ఆదిత్య రూపములో వుండిన పితృ శక్తి, 'ప్రథమం పూర్వం' (First In First Out FIFO) క్రమములో, ప్రేత వసురూపం

పొందుటకు, పితృలోకమునకు పైస్థాయి లో వుండే 'స్వర్గ' లోకము (సువర్లోకము) ను చేరవలసి ఉంటుంది. అందుకే కర్త/లు వారిని స్వర్గము వైపు వెళ్ళమని ప్రార్థిస్తారు. ఈ ప్రక్రియను 'స్వర్గ పాథేయము' అంటారు. 'సపిండీకరణము', 'స్వర్గ పాథేయము' కాగానే ప్రేతకు వసు రూప స్థాయి, అప్పటి దాకా వసురూపములో వున్న పితరులకు రుద్రరూపము, అప్పటిదాకా రుద్ర రూపములో వున్నపితరులకు ఆదిత్య రూపములు వస్తాయి. ఆ క్షణం నుండీ మరణించిన నాటి నుండీ 'ప్రేత' గా పిలువబడిన (సంబోధింపబడిన) మృతుడు/మృతురాలు ఇక ముందు 'ప్రేత' గా కాకుండా 'వసురూప' 'పితృ'గా ఉంటారు/సంబోధింపబడుతారు. (ఇతః పరమ్ ప్రేత శబ్దం / రూపం, 'నాస్తి').

ప్రాణం వున్నప్పుడు - **మనిషి**

ప్రాణం పోయిన తరువాత - **'ప్రేత'** - 10+2 రోజులు

సపిండీకరణము తరువాత 12 వ రోజు నుండి - **'వసురూప పితృ'**

తరువాత తరం వారు మరణించిన తర్వాత - **'రుద్ర రూప పితృ'**

తరువాత 2వ తరంవారు మరణించిన తర్వాత - **'ఆదిత్య రూప పితృ'**

తరువాత 3వ తరం వారు మరణించిన తర్వాత - స్వర్గ ప్రవేశము

(ఈ తరం వారిని జీవించి వున్నవారు పూర్తిగా మరిచిపోతారు)

✤ కర్త/లు 'సపిండీకరణము', 'స్వర్గ పాథేయము' కార్యక్రమములలో ప్రేతకు పితృ లోకములో "పితృ" రూపము కలుగుటకు అక్కడ వున్నమరొక జంట దైవ శక్తులను అర్చించి సహాయం పొందుతారు. వీరిని కాల, కాముక పేర్లున్న "విశ్వే దేవులు" అంటారు.

## అంత్యేష్టి-మూడవ దశ :
## మాసికములు,సంవత్సర విమోక శ్రాద్ధము

✤ తల్లికానీ, తండ్రిగానీ (లేదా ఉభయులూ) మరణించిన తర్వాత ప్రతి పుత్రుడూ నిర్వర్తించవలసిన అంత్యేష్టి సంస్కారము - మొదటి మరియు రెండవ దశలలో నిర్వర్తించవలసినవి, ఖననము/ దహనము, అస్థి సంచయనము, అస్థి నిక్షేపణము, దశాహ, ఏకాదశాహ, ద్వాదశాహములు. (10+2 రోజుల కర్మకాండ)

- ✤ వ్యక్తి మరణించిన నాటి నుండీ మొదటి సంవత్సర కాలమంతా అంత్యేష్టి సంబంధము గానే సంవత్సర సూతకము (ప్రేత పితృ లోకము చేరుటకు పట్టు కాలము - రవి చుట్టూ ఒక భూ పరిభ్రమణము) ఉంటుంది. కనుక ఆ కాలము అంత్యేష్టి సంస్కార మూడవ దశ గా చెప్పవచ్చును.
- ✤ ఈ సంవత్సర కాలములో, కర్త/లు, ప్రతి చాంద్రమాసములో (రెండు పున్నముల నడుమ) మరణ తిథి నాడు ఒక మాసికమును, అనగా సాధారణంగా 12 మాసికములు, (అధిక మాసం వస్తే 13 అవుతాయి) ఆచరించాలి.
- ✤ మరణించిననాటినుండి, మరణ తిథి సంబంధం లేకుండా, మూడవ పక్షములోని మొదటి 5 రోజులలో 'త్రైపక్షిక' మాసికము, 12 వ పక్షంలోని రెండవ 5 రోజులలో 'ఊన షాణ్మాసికము', సంవత్సరాంతపు పక్షములో చివరి 5 రోజులలో 'ఊనాబ్ద' మాసికము, మొత్తం 15 మాసికములు (సంవత్సరం లో అధిక మాసం వుంటే 16) నిర్వర్తించాలి.
- ✤ మొదటి సంవత్సరపు మరణ తిథి కన్నా ముందు రోజు, సంవత్సర విమోక శ్రాద్ధము, మొదటి సంవత్సరపు మరణ తిథి నాడు ప్రథమ సాంవత్సరీక శ్రాద్ధము (ప్రథమాబ్దికము) నిర్వర్తించడం తో అంత్యేష్టి సంస్కార ప్రక్రియ పూర్తి అవుతుంది.

## "అంత్యేష్టి" క్రమము - సారాంశము

1. అంత్యేష్టి చేయు వారు (కర్త/లు) శుద్ధి అగుట - స్నానము చేయుట
2. మరణకాల సర్వ ప్రాయశ్చిత్తము - మరణించిన వ్యక్తి జీవించి వున్నప్పుడు తెలిసి కానీ తెలియక గానీ చేసిన పాపముల ప్రాయశ్చిత్తము చేయుట
3. మరణించిన వ్యక్తి పార్థివ దేహమును శుద్ధి చేయుట - మంత్రములతో నీరు చల్లుట లేదా స్నానము చేయించుట
4. పార్థివ శరీరమును జాగ్రత్తగా రుద్రభూమికి తరలించుటకు శవ వాహకులను నిమంత్రించుట.
5. సమస్త బంధుజనము పార్థివ శరీరమునకు ప్రదక్షిణ నమస్కారము చేయుట
6. పార్థివ దేహమును రుద్రభూమికి కొనిపోవుట, అంతిమ యాత్ర
7. మృత దేహమునకు ఖనన లేదా దహన సంస్కారము చేయుట

8. దహనము చేసిన ఎడల అస్థి సంచయనము - దహన స్థల శుద్ధి (ఖననం చేసి వుంటే సమాధి ఏర్పాటు)

9. ప్రవాహ జలములో అస్థి నిక్షేపణము

10. మరణ దినాదిగా కర్మకాండ (నిత్యకర్మ- శిలా ప్రతిష్ఠ, తిలోదకములు, వాసోద కములు, మృత్తికాస్నానములు, ప్రేతకు పిండప్రదానము, పక్షికి అన్నం పెట్టడం)

11. నగ్న శ్రాద్ధ, నవ శ్రాద్ధములు (ఆహ్నిక, నగ్న శ్రాద్ధములు)

12. దశాహము - 10 వ రోజు కర్మ, (శిలోద్వాసన, ధర్మోదకాలు)

13. ఏకాదశాహము - 11 వ రోజు కర్మ, (వృషోత్సర్జనము, ఏకోద్దిష్టము, షోడశము)

14. ద్వాదశాహము - 12 వ రోజు కర్మ, (స్వర్గపాథేయము సపిండీకరణము, ఆద్య మాసికము)

15. త్రైపక్షిక శ్రాద్ధము - 3 వ పక్షము లో మొదటి 5 రోజులలో (31 నుండి 35 వ తిథులలో) మరియు 2,3,4,5 నెల మాసికములు,

16. ఊన షాణ్మాసికము - 12 వ పక్షము లో రెండవ 5 రోజులలో (170 నుండి 175 వ తిథులలో)

17. నెల మాసికములు (6,7,8,9,10,11,12)

18. సంవత్సర చివరి పక్షంలో మూడవ 5 రోజులలో - ఊనాబ్దికము (355 నుండి 360 వ తిథులలో)

19. సంవత్సర విమోక శ్రాద్ధము (360 వ తిథి)

20. ప్రథమ సాంవత్సరీక శ్రాద్ధము

## బాలలు, సన్యాసులు (యతులు) - అంత్యేష్టి సంస్కారము

సనాతన ధర్మములో, మానవ జీవితము సహజంగానే - బాల్య, కౌమార, యౌవన వార్ధక్య దశలుగా, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస అనబడే నాలుగు ఆశ్రమాలుగా వుంటుందని ప్రాచీన సామాజిక శాస్త్రజ్ఞులైన ఋషులు నిర్ధారించారు. సన్యాసాశ్రమము ను యత్యాశ్రమము అని కూడా అంటారు.

సంఘజీవులైన మానవ జీవితాలు, సాధారణంగా, బాల్య కౌమార దశలలో బ్రహ్మచర్యాశ్రమము, యవ్వన దశలో గృహస్థాశ్రమము, వార్ధక్య దశలో వానప్రస్థ, సన్యాస ఆశ్రమములలో కొనసాగుతాయి.

- ఆత్మ ఆశ్రయించిన శరీరము, మొదటి ఆశ్రమములో, ప్రకృతి పై చూపించే ప్రభావము తక్కువ. అందువలన చిన్న వయసులోనే ప్రకృతి మీద, ప్రపంచం గురించి, ఎక్కువ అవగాహన రాక మునుపే మరణిస్తే, వారి జీవించిన ప్రభావము ఎక్కువ కాలము జ్ఞాపకములలో వుండదు. వారి శరీర శక్తి, మరణానంతరము పంచభూతములలో లయమగుటకు ఎక్కువ కాలము పట్టదు. అందువలన శిశువులు, బాల బాలికలు మరణించి నపుడు పూర్తి స్థాయి మరణానంతర సంస్కారములు నిర్దేశించబడలేదు.
- ఆ నాటి జీవన విధానం ప్రకారం స్త్రీలు వివాహమయ్యే లోగా, పురుషులు విద్యాభ్యాస వయసు దాటక మునుపు మరణిస్తే వారికి అంత్యేష్టి సంస్కారం చాలా క్లుప్తముగా జరుపుటకు (శరీరమును పంచ భూతములలో కలుపు వరకు మాత్రమే) నియమాలు ఏర్పరిచారు. మృతాశౌచ కాలము, నియమాలు కూడా క్లుప్తీకరించినారు. వారికై ప్రత్యేకముగా ఎలాంటి శ్రాద్ధములూ నిర్దేశించలేదు.
- సన్యాసాశ్రమము (యత్యాశ్రమము) లో జీవించేవారు ఆశ్రమ ధర్మం ప్రకారం తమ శరీర శక్తిని పంచ భూతములలో లయము చేసే సాధన చేస్తుంటారు. సంఘ జీవనము త్యజించి, కుటుంబ బంధముల నుండి దూరమై వుంటారు. ఒక విధంగా వారు స్వర్గ పాథేయులు. అందువలన సన్యాసులు, యతులు మరణిస్తే గృహస్థులకు వుండే అంత్యేష్టి విధానము వర్తించదు. శరీరమును పంచ భూతములకు అప్పగించే వరకు మాత్రమే (అంతిమ సంస్కారము) మరణానంతర విధి వుంటుంది. వారి అనుయాయులు వారి బోధనలను గుర్తు చేసుకుంటూ "ఆరాధన" మాత్రం చేసుకుంటారు. అయితే యతి అంతిమ సంస్కారమునకు ప్రత్యేక విధానము వుంటుంది. ఇది ఆ యా గురువుల పరంపర లో నిర్ణయమై వుంటుంది.

# మానవ జీవన పరమార్ధం - పంచ మహా యజ్ఞాలు

గృహస్థాశ్రమంలో వున్న ప్రతి మనిషీ విధిగా ప్రతి దినమూ పంచ మహాయజ్ఞాలు నిర్వర్తించాలి. అవి-

**భూత యజ్ఞం** (ప్రకృతిలో వున్న అన్ని రకాల ప్రాణుల జీవనమునకు ఆటంకము కలిగించకుండా వుండడం),

**మనుష్య యజ్ఞం** (తోటి మానవులందరితో పరస్పర సహకార, సాదర భావనతో జీవించడం, జీవించనివ్వడం),

**బ్రహ్మ యజ్ఞం** (నిరంతరం ఐహిక, ఆముష్మిక జిజ్ఞాసతో విజ్ఞానము పొందుతూ అధ్యయన, అధ్యాపనలు సాగించడం),

**దేవ యజ్ఞం** (తన అధీనములో లేని దైవిక శక్తుల ను ఆరాధించడం),

**పితృ యజ్ఞం** (తన పూర్వజులను ఆరాధించడం). అన్ని యజ్ఞములలోనూ దాన ధర్మములు (తన వద్ద వున్న వనరులను పంచుకోవడం) చేయవలసి ఉంటుంది.

ఈ పంచ మహాయజ్ఞములు **ఋణత్రయము** - (దేవఋణము, పితౄణము, ఋషి ఋణము) నుండి విముక్తి కొరకు చేయవలసినవే.

వీటిలో పితృయజ్ఞానికి విశేష స్థానం ఉంది. పితౄణము తీర్చుకోవడమునకు ఇది మాత్రమే చేయవలసి వుంటుంది.

## పితృ యజ్ఞము, పితృ దేవతలు - జన్యుశాస్త్ర విజ్ఞానం

భూమిపై జీవించి వున్నవారికి పితృ దేవతలు కేవలం మరణించిన తలిదండ్రులే కాదు. పితృలోకము చేరిన వారందరూ పితృ దేవతలే.

## సృష్టి కర్త బ్రహ్మ మొదలుగా కుటుంబవ్యవస్థా క్రమము

సంఘజీవి అయిన ప్రతి మనిషికీ ఎవరెవరు పితృ దేవతలు అనే విషయాన్ని శాస్త్రీయంగా జన్యుశాస్త్ర విజ్ఞానం ఉపయోగించి ఋషులు సనాతన ధర్మ వాఙ్మయములో, సృష్టి కర్త బ్రహ్మ నుండి మొదలుకొని మర్త్యలోకమున జీవించి వుండే మనిషి వరకు 3 స్థాయిలలో కుటుంబ వ్యవస్థ ను నిర్వచించి పితృ యజ్ఞము చేయుటకు పితృ దేవతల 'కారుణ్య వర్గ క్రమము' నిర్ణయించినారు.

## I. దేవతా వర్గము (పితృ గణములు) :

బ్రహ్మ- ప్రజాపతులు- పితృగణములు - అమూర్తులు, మూర్తిమంతులు

## II. పితృదేవతా వర్గము (పితృ దేవతలు):

సగోత్రీకులు-సోదకులు (సమానోదకులు)-సపిండులు - పిండదాత -లేపభాజులు- పిండభాగులు

## III. కారుణ్య వర్గము

1. మరణించినవారు (తల్లి నుండి మొదలుకొని అందరు రక్త సంబంధీకులు, కళత్ర రక్త సంబంధీకులు మరియు ఆచార్యులు, గురువులు, మిత్రులు మొదలగు వారు)

2. జీవించి వున్నవారు - (తల్లి నుండి మొదలుకొని అందరు రక్త సంబంధీకులు, కళత్ర రక్త సంబంధీకులు మరియు ఆచార్యులు, గురువులు, మిత్రులు మొదలగు వారు) (ఈ వర్గమునే నేటి కాలములో భారత దేశములో వున్న కుటుంబ వ్యవస్థ గా పరిగణిస్తున్నాము )

జన్యు శాస్త్ర విజ్ఞానము ? "సపిండులు","సమానోదకులు","సగోత్రీకులు"

సాధారణంగా పితృదేవతలకు సంబంధించిన విజ్ఞానమంతా జన్యుశాస్త్ర విజ్ఞానమే ఇందుకు రుజువే శాస్త్రములలో వున్న 7×3=21 తరముల దాకా ఇచ్చిన వివరణ. కాలక్రమంలో ఈ విషయం మరుగున పడింది.

జీవ/జన్యు శాస్త్ర కోణము నుండి కూడా ప్రతి మనిషి లోనూ తలిదండ్రులనుండి మొదలుకొని - తండ్రి వైపు తండ్రి వంశములో 7,

తల్లి నుండి 'నానమ్మ' (తండ్రి తల్లి) మొదలు తండ్రి వంశములో 7,

తాత (తల్లి తండ్రి, మాతామహ) వంశములో తాత నుండి 7,

తల్లి తల్లి (మాతామహి), ఆమె నానమ్మ మొదలు మాతామహ వంశములో 7,

మొత్తం 28 వెనుక తరాల (పూర్వీకుల) వారి జన్యువులు - జీన్స్ వుంటాయి.

వీరందరినీ "సపిండులు" (సాపిండ్యులు) అంటారు. వీరిలో మరణించిన వారు పితృ దేవతలు అవుతారు. వీరు మూడు వర్గాలు.

**శ్లో॥ లేపభాజ శ్చతుర్థాద్యాస్త్రద్రాద్యాః పిండభాగినః ।**
**పిండదస్సప్తమస్తేషామ్ సాపిండ్యం సాప్తపౌరుషం ॥** (మాత్స్య వచనము)

పిండములు పొందు ముగ్గురి పైన నాల్గవ వారి నుండి పై ముగ్గురు లేపము అనగా పిండశేషకణములు పొందువారు వారిపైన ఏడవ వారు పిండలేపమునిచ్చు దాత అని తాత్పర్యము. (ధర్మసింధు-అసపిండ నిర్ణయము)

**పిండభాగులు -** 3 తరముల వారు - వసు రుద్ర ఆదిత్య రూపములు. వీరికై పితృ కార్యములు చేస్తారు.

**లేపభాజులు -** పిండభాగులపైన వుండే 3 తరముల వారు - స్వర్గము చేరిన వారు. వీరికై పితృకార్యములు ఏమీ నిర్దేశించబడలేదు.

**పిండదాత -** లేపభాజుల పైన వుండే తరము, వారికన్నా ముందు స్వర్గము చేరిన వారు. వీరికై పితృకార్యములు ఏమీ నిర్దేశించబడలేదు.

ప్రాచీన శాస్త్రములలో 'జన్యువు' ను అర్థం చేసుకోవడానికి 'పిండము' అనే పదము వాడినట్టు తెలుస్తున్నది.

## జన్యు సంబంధ వంశ క్రమము- "సగోత్రీకులు"

యల్లాజీయమ్ అను ధర్మ శాస్త్రము ప్రకారము :

**శ్లో॥ ఆ సప్తమాదేక కులోద్భవానాం సపిండ సంజ్ఞా భవతి ద్విజానామ్ ।**
**చతుర్దశాత్సోదక సంజ్ఞకాస్స్యు సగోత్రజాత్తత్పరి మేక వింశాత్ ॥**

మొదటి ఏడు తరాల వారిని "సపిండులు", తరువాత 7 తరాల వారిని "సోదకులు" (సమానోదకులు), ఆపై 7 తరాల వారిని "సగోత్రీకులు" అంటారు.

## సపిండులు

| | |
|---|---|
| మొదటి 3 తరముల వారు - వారి వంశజులు (వసు రుద్ర ఆదిత్య రూపములు) | - **పిండ భాగులు** |
| 4,5,6 తరముల వారు - వారి వంశజులు | - **లేపభాజులు** |
| 7 వ తరము వారు - వారి వంశజులు | - **పిండదాత** |

## సోదకులు (సమానోదకులు)

తరువాత 7 తరముల వారు - వారి వంశజులు

## సగోత్రీకులు

తరువాత 7 తరముల వారు - వారి వంశజులు

**శ్లో॥ సప్తమే దశ రాత్రం స్యాదూర్ధ్వం సప్త త్ర్య హం భవేత్ ।**
**ఏకాహం తత ఊర్ధ్వం స్యాదేక వింశాన్నివర్తతే ॥**

సపిండుల వంశజులు మరణించిన 10 రాత్రులు, సోదకుల వంశజులు మరణించిన 3 రాత్రులు, సగోత్రీకుల వంశజులు మరణించిన ఒక రాత్రి మృతాశౌచము పాటించాలి. 21 తరము తరువాత వంశానుగత సంబంధము వుండదు.

## కారుణ్య వర్గ క్రమము-మరణించినవారు (పితృదేవతలు) :

జన్యు ఆధారిత కుటుంబ వ్యవస్థను నిర్వచిస్తూనే, పితృ సంబంధ విజ్ఞానము నందించే క్రమములో, ప్రాచీన శాస్త్రజ్ఞులు, భూమిపై జీవిస్తున్న వర్తమాన తరము వారికి (పితృ యజ్ఞము చేయు కర్త/లకు), రక్త సంబంధము మరియు సామాజిక సాన్నిహిత్యము ఆధారంగా, అత్యంత సమీప బంధు వర్గము గురించిన వివరణ ను కూడా అందించారు. దీనినే "కారుణ్య వర్గ క్రమము" అంటారు. (పితృస్వామ్య సమాజ విధానములో వున్నాము కనుక ఈ వివరణ మొత్తం కుటుంబ ప్రతినిధి గా కుటుంబ యజమానికి - పురుష కర్త/లకు - సంబంధించినదిగా గ్రహించాలి)

బౌధాయన సూత్రముల ప్రకారం పితరుల కారుణ్య వర్గము క్రింది శ్లోకములో వివరించబడినది.

**ఆదౌ పితా[1] తథా మాతా[2] సాపత్నీ[3] జననీ[4] తథా**
**మాతామహాస్సపత్నీకా[5,6] ఆత్మపత్నీ[7] త్వనంతరం**
**సుత[8] భ్రాతృ[9] పితృవ్యాశ్చ[10] మాతులాస్సహభార్యకాః[11]**
**దుహితా[12]భగినీ[13]చైవ దౌహిత్రో[14]భాగినేయకాః[15]**
**పితృశ్వస[16] మాత్రుశ్వస[17] జామాతా[18] భావుక[19] స్నుషాః[20]**
**శ్వశుర[21] శ్యాలక[22]శ్చైవ శ్వశ్రూషాశ్చ[23] గురు[24] రిక్థినః[25]**

పితృస్వామ్య సమాజము నందు కుటుంబ భారము వహించు పురుషుడు మొత్తం కుటుంబ ప్రతినిధి (యజమాని) గా, పితృ కార్యములు చేయు కర్తగా, ఈ శ్లోకము ననుసరించి, మూడు కారుణ్య వర్గములను సూచించారు. అవి-

1. యజమాని పితృ వర్గము
2. యజమాని మాతృ వర్గము
3. యజమాని ఆత్మపత్ని మొదలగు వర్గము

యజమానికి రక్త సంబంధీకులైన అత్యంత సమీప బంధువులు, జీవితాన్ని ప్రభావితం చేసే ఇతర సహచరులు వరుసగా క్రింద పట్టికలో వివరించిన విధంగా వుంటారు.

## 1. మాతృ త్రయ సహిత పితృ త్రయము (6)

| క్రమసంఖ్య | వసురూప పితృదేవతలు | రుద్రరూప పితృదేవతలు | ఆదిత్యరూప పితృదేవతలు |
|---|---|---|---|
| 1,2,3 | పితృ (తండ్రి) | పితామహం | ప్రపితామహ (ముత్తాత) |
| 4,5,6 | మాతృ (తల్లి) | పితామహీం | ప్రపితామహీ (ముత్తవ్వ) |
| 7 | సాపత్నీమాతా (సవతితల్లి) | × | × |
| 8 | జనని (కన్నతల్లి)<br>(కర్త దత్త పుత్రుడైతే) | × | |

## 2. సపత్నీక మాతామహ త్రయము (6)

| క్రమసంఖ్య | వసురూప పితృదేవతలు | రుద్రరూప పితృదేవతలు | ఆదిత్యరూప పితృదేవతలు |
|---|---|---|---|
| 9,10,11 | మాతామహ (తల్లి తండ్రి) | మాతృ పితామహ | మాతృ ప్రపితామహః |
| 12,13,14 | మాతామహి(అమ్మమ్మ) | మాతృ పితామహి | మాతృ ప్రపితామహి |

## 3. ఆత్మ పత్న్యాది కారుణ్యవర్గము (33)

| క్రమసంఖ్య | వసురూపపితృదేవతలు(మరణించినబంధువులు) | వాడుకలో ఉన్న బంధుత్వ పదాలు |
|---|---|---|
| 15 | ఆత్మపత్ని | భార్య |
| 16,39 | సుత, స్నుషా | కొడుకు, కోడలు |
| 17,18,19 | భ్రాత, భ్రాత పత్ని, భ్రాత పుత్ర కొడుకు | తోబుట్టువులు-పురుష,/భార్య/ |
| 20,21,22 | పితృవ్య, పితృవ్య పత్నీ, పితృవ్య పుత్ర | తండ్రి తోబుట్టువులు- పురుష |
| 23, 24 | మాతులః, మాతులః పత్నీ | తల్లి తోబుట్టువు-పురుష/భార్య |
| 25, 36 | దుహితః, జామాత | కూతురు, అల్లుడు |
| 26, 27 | భగినీ, భగినీ భర్తా | సహోదరి, బావగారు |
| 28, 29 | దౌహిత్ర, దౌహిత్ర పత్నీ | కూతురు కొడుకు, |
| 30, 31 | భాగినేయకః, భాగినేయక పత్నీ | సోదరి కొడుకు |
| 32, 33 | పితృ భగినీ, పితృ భగినీ భర్తా | తండ్రి తోబుట్టువు - స్త్రీ/ భర్త |
| 34, 35 | మాతృ భగినీ, మాతృ భగినీ భర్తా | తల్లి తోబుట్టువు - స్త్రీ/ భర్త |
| 37, 38 | భావుకః, భావుకః పత్నీ | మేనత్త/మేనమామ కొడుకు/భార్య |
| 40, 41 | శ్వశురః, శ్వశుర పత్నీ | భార్య తండ్రి, భార్య తల్లి |
| 42, 43 | శ్యాలకః , శ్యాలక పత్నీ | భార్య సోదరులు, వారి భార్య |
| 44 | స్వామీ | యజమాని |
| 45 | సఖా | మిత్రులు |
| 46 | గురుః | గురువులు |
| 47 | ఆచార్యా | ఉపాధ్యాయులు |

పితృ యజ్ఞములలో, ఈ పట్టిక/ క్రమం కర్త/ల యొక్క మరణించిన బంధువులకు మాత్రమే వర్తిస్తుంది. సజీవులైన బంధువులకు వర్తించదు - వారిని పట్టిక/క్రమం లో మినహాయించాలి.

## విశ్వేదేవులు - పితృదేవతల అంగ రక్షకులు

**దక్షస్య దుహితా సాధ్వీ విశ్వా నామ ప్రకీర్తతా ।**
**తస్యాః పుత్రా మహావీర్యాః విశ్వే దేవా స్త్రయోదశః ॥**

సాధ్వి అయిన దక్షప్రజాపతి పుత్రిక, ధర్ముని భార్య, విశ్వ అను పేరు గాంచిన ఆమెకు మహావీరులైన పదముగ్గురు పుత్రులే విశ్వే దేవులు.

వీరు పితృదేవతల యోగక్షేమాలను విచారిస్తుంటారు. మనం నెరవేర్చే పితృ కార్య ఫలాలను ఆయాలోకాల్లో ఉన్న పితృదేవతలకు అందిస్తుంటారు. అలాగే వారి ఆశీస్సులను మనకు అందజేస్తారు.

## విశ్వేదేవులు - శ్రాద్ధములను బట్టి ప్రత్యేక బాధ్యతలు :

**ఇష్టి శ్రాద్ధే దక్ష క్రతూ, సంకీర్త్యౌ వైశ్వదేవకౌ ।**
**నాందీ ముఖే సత్యవసూ, సాపింద్యే కాల కాముకౌ ॥**

**పురూరవార్ద్రవౌచైతౌ పార్వణే సముదాహృతౌ ।**
**హేమ శ్రాద్ధే ధను రుచీ, తీర్థే ధూరి విలోచనౌ ।**
**ఏకోద్దిష్టే రుద్ర సంజ్ఞౌ విశ్వేదేవా స్త్రయోదశ ॥**

| శ్రాద్ధము | అర్చించవలసిన విశ్వేదేవుల సంజ్ఞలు (పేర్లు) | |
|---|---|---|
| **ఇష్టి** | **దక్ష, క్రతువు** | ఇష్టి శ్రాద్ధమునందు దక్ష, క్రతువులు, నాందీముఖము నందు సత్య, వసులు, సపిండీకరణము నందు కాల,కాముక, పార్వణము (ప్రత్యాబ్దికము) నందు పురూరవ, ఆర్ద్రవ లు, హిరణ్య శ్రాద్ధమునందు ధను రుచిలు, తీర్థ శ్రాద్ధమునందు ధూరి, విలోచనులు, ఏకోద్దిష్టమునందు రుద్ర అను విశ్వే దేవతలను అర్చించాలి.(ఆధారము : యాజుష అపర ప్రయోగానుక్రమణిక) |
| **నాందీముఖము** | **సత్య, వసు** | |
| **సపిండీకరణము** | **కాల, కాముక** | |
| **పార్వణము (ప్రత్యాబ్దికము)** | **పురూరవ, ఆర్ద్రవ** | |
| **హిరణ్య శ్రాద్ధము** | **ధను, రుచి** | |
| **తీర్థ శ్రాద్ధము** | **ధూరి, విలోచన** | |
| **ఏకోద్దిష్టము** | **రుద్ర** | |

## 'శ్రాద్ధము' (పితృ యజ్ఞము) - నిర్దేశిత శ్రాద్ధ కర్మలు

**"శ్రద్ధయాదీయత ఇతి శ్రాద్ధం" "శ్రద్ధయా అనేనేతి శ్రాద్ధమ్"** - శ్రద్ధాతిశయముచే (పితరుల కొరకు) చేయతగినది అని 'శ్రాద్ధము'నకు నిర్వచనము.

1. పితృస్వామ్య సమాజములో ప్రతి కుటుంబ పెద్దా తన కుటుంబ క్షేమమును అపేక్షించి కుటుంబ ప్రతినిధిగా నిత్య నైమిత్తికము లలో భాగంగా ప్రతి నిత్యమూ చేయవలసిన దేవతారాధన (ప్రకృతి శక్తులను పూజించుట) తో పాటు మరణించిన తన పితృ దేవతలను (వసు రుద్ర ఆదిత్య రూపములు) కూడా ఆరాధించవలసినదిగా స్మృతులు బోధిస్తున్నాయి.

   ప్రతి రోజూ చేయు పితృ ఆరాధనను **'నిత్యశ్రాద్ధము'** అని వ్యవహరిస్తారు. అనగా నిత్యమూ ఒక బ్రాహ్మణుడిని పితృదేవతా రూపమున అర్చించి (అర్ఘ్య, ఆవాహన, పిండప్రదాన రహితముగానే) భోజనము పెట్టి తర్పణ చేయుట. దీనిలో నువ్వులు, ప్రాచీనావీతము అక్కర లేదు. కర్తకు, భోక్తకు పునర్భోజనము, బ్రహ్మచర్యము, భూశయనము వంటి నియమములు పాటించడం కూడా అవసరం లేదు. 'నిత్యశ్రాద్ధ' విధికి ప్రత్యామ్నాయమే నిత్య పితృ తర్పణములు. ప్రతి రోజూ పితృదేవతల నుద్దేశించి జల తర్పణమైననూ చేసినచో అది పితృ యజ్ఞమగును. నిత్యపితృ తర్పణ చేయునపుడు పవిత్రధారణ, తిలలు అక్కర లేదు. కేవలము జలముతో సర్వ కారుణ్య వర్గమును ఒక్కొక్కరిగా తలచుకొని తర్పణము విడువ వలయును.

2. ఒక సంవత్సరములో నిర్ణీత కాలములలో, తండ్రి మరణించిన తరువాత మాత్రమే, కర్త ఆచరించవలసిన శ్రాద్ధములు క్రిందివిధముగా వున్నాయి.

   i) **'షణ్ణవతి' శ్రాద్ధములు** (96)
   (మరణించిన మాతృ, పితృ, మాతామహ, మాతామహి త్రయములకు)

   **"అమా మను యుగ క్రాంత ధృతిపాత మహాలయాః,
   తిస్రోష్టకాశ్చ విజ్ఞేయా షణ్ణవతీ ప్రకీర్తితాః"**

   ఒక సంవత్సర కాలములో వుండు -

   12 అమావాస్య తిథులు (చైత్రాది ఫాల్గుణ పర్యంతం)

మన్వాదుల తిథులు - 14

| మన్వంతరము | మన్వాది తిథి |
|---|---|
| 1 ఉత్తమ | చైత్ర శు.తదియ |
| 2 రౌచ్యక | చైత్ర పూర్ణమి |
| 3 భౌచ్యక | జ్యేష్ఠ పూర్ణమి |
| 4 చాక్షుష | ఆషాఢ శు. దశమి |
| 5 రుద్రసావర్ణిక | ఆషాఢ బ. అష్టమి |
| 6 అగ్నిసావర్ణిక | శ్రావణ అమావాస్య |
| 7 తామస | భాద్రపద శు. తదియ |
| 8 సూర్యసావర్ణిక | భాద్రపద బ. అష్టమి |
| 9 స్వారోచిష | ఆశ్వీజ శు. నవమి |
| 10 స్వాయంభువ | కార్తిక శు. ద్వాదశీ |
| 11 ఇంద్రసావర్ణిక | కార్తిక పూర్ణిమ |
| 12 రైవత | పుష్య శు. ఏకాదశీ |
| 13 వైవస్వత | మాఘ శు. సప్తమీ |
| 14 బ్రహ్మసావర్ణిక | ఫాల్గున పూర్ణమి |

యుగాదుల తిథులు - 4

| యుగము | యుగాది తిథి |
|---|---|
| 1 త్రేతా యుగము | వైశాఖ శు. తదియ |
| 2 కృత యుగము | కార్తిక శు. నవమి |
| 3 కలి యుగము | భాద్రపద బ. త్రయోదశీ |
| 4 ద్వాపర యుగము | మాఘ అమావాస్య |

రవి రాశి సంక్రమణముల తిథులు - 12 (మేషాది మీన పర్యంతం)

'వైధృతి' యోగము వుండు తిథులు - 13

'వ్యతీపాత్' యోగము వుండు తిథులు - 13

మహాలయ పక్ష తిథులు - 16

(భాద్రపద కృష్ణ పక్ష 15 తిథులు, ఆశ్వీజ శుక్ల పాడ్యమితో కలిపి)

త్రిస్రోష్టక తిథులు - 12
(మార్గశిరం నుండి 4 మాసములలో 3 కృష్ణ పక్ష మధ్య తిథులు)

| **త్రిస్రోష్టకలు** | **తిథులు** |
|---|---|
| మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణ మాసములలో వుండు | - **బహుళ సప్తమి, అష్టమి, నవమి** |

**మొత్తం 96 (షణ్ణవతి) శ్రాద్ధములు ఆచరించ వలసిన తిథులని శాస్త్ర వచనము.**

అమావాస్య, సంక్రమణ, గ్రహణ దినములలో శ్రాద్ధమునకు ప్రత్యామ్నాయముగా తిలతర్పణము చేయవచ్చును. తిలతర్పణము చేయునప్పుడు పవిత్రధారణ ఆవశ్యకము.

**గమనిక :** షణ్ణవతి తిథులలో మన్వాది, మహాలయ, యుగాది తిథులలో వున్న శ్రావణ, భాద్రపద, మాఘ అమావాస్యలు 12 అమావాస్యలలో కూడా ఉంటాయి. అధిక మాసము వచ్చిన సంవత్సరములో 13 అమావాస్యలు ఉంటాయి.

ii) **మహాలయ పక్ష శ్రాద్ధములు**
(భాద్రపద కృష్ణ పక్షమునందు, మరణించిన తల్లి, తండ్రులకు, ఇతర మరణించిన కారుణ్య వర్గ బంధువులు, సహచరులందరికీ - సర్వ కారుణ్య వర్గము వారికి)

iii) **తీర్థ శ్రాద్ధములు**
(పుణ్యక్షేత్ర సందర్శనం, తీర్థ యాత్రలు చేయునపుడు, సర్వ కారుణ్య వర్గమునకు) కర్త/లు తీర్థ యాత్రలు చేస్తున్నపుడు వెళ్లిన ప్రదేశములో, అది ఏ రోజైనా, తిథి అయినా, "తీర్థ శ్రాద్ధము" నిర్వర్తించాలి. వారి నిత్యనైమిత్తిక జీవితములో వృత్తి/ వ్యాపార/ కార్య రీత్యా వెళితే, వెళ్లిన ప్రతిసారీ నిర్వర్తించవలసిన అవసరం లేదు.

iv) ప్రత్యాబ్దికము - ప్రతి సంవత్సరము ఒక రోజు, కేవలము మరణించిన తల్లికి, తండ్రికి మాత్రమే - వారు మరణించిన తిథి రోజున ఆచరించ వలసినది. తండ్రి జీవించి వున్న కర్త - జీవ పితృడు, మరణించిన తల్లికి మాత్రము శ్రాద్ధము ఆచరించుటకు అర్హుడు.

● ఇది మరణించిన తలిదండ్రుల సంతానము నిర్వర్తించవలసిన ధార్మిక బాధ్యత. ఇది ప్రధాన "పితృ యజ్ఞము". దీనిని, పుత్రులు, పుత్రులు లేనివారికి దౌహిత్రులు కర్త/లుగా జీవించినంత కాలము ఆచరిస్తూనే ఉండాలి. మరణించిన వారికి పుత్రులు/

దౌహిత్రులు లేకుండా కేవలం స్త్రీ సంతానం వున్నట్లైతే లేదా నిస్సంతులైనా స్త్రీకి భర్త స్వయముగా, పురుషుడికి అతని భార్య - తన "ప్రతినిధి కర్త" ద్వారా (కర్తృత్వబాధ్యత నిచ్చి) జీవించినంతకాలం ఈ బాధ్యత నిర్వర్తించాలి.

● ఇది సంవత్సరానికి ఒక రోజు మాత్రమే చేస్తారు. సాధారణ పరిభాషలో దీనిని "తిథి", "శ్రాద్ధము", "ప్రత్యాబ్దికము", "తద్దినము" అని కూడా అంటారు.

● పితృ యజ్ఞము చేయు రోజున కర్త/లు కొన్ని నియమ నిబంధనలు పాటించాలి. వసు రుద్ర ఆదిత్య రూపములలో, పితృ లోకమున వున్న పితృ దేవతలను తీసుకొని వారికి తోడుగా రమ్మని పురూరవ, ఆర్ద్రవ అనే పేర్లున్నజంట దైవ శక్తులను (విశ్వే దేవతలు అంటారు) ప్రార్ధించి వారిని కూడా ఆహ్వానించి, అర్చిస్తారు. అలాగే 'శ్రాద్ధ సంరక్షకుడి'గా శ్రీ మహా విష్ణువు అనే దైవశక్తిని కూడా ఆహ్వానించి అర్చిస్తారు. పితృ దేవతలకు, దైవశక్తులకు తృప్తి కలిగే విధంగా భోజనాదుల తో అర్చించి దీవెనలు పొందుతారు. 'సృష్టిపోషకు'డైన శ్రీమన్నారాయణుడికి 'శ్రాద్ధ సంరక్షణ' కూడా ఒక బాధ్యతగా ఋషులు భావించారు. గయా క్షేత్రములో వున్న విష్ణుపాద క్షేత్రములో విష్ణుమూర్తి రూపం కాకుండా పాదములు మాత్రమే వుంటాయి.

● పంచాంగము ప్రకారము వ్యక్తి మరణించిన రోజు (చాంద్రమానం పాటించువారు తిథి, పక్షము, మాసము ప్రమాణంగా, సౌరమానం పాటించు వారు పక్షము, మాసము, చంద్రుడు వున్ననక్షత్రం ప్రమాణంగా) పితృ యజ్ఞము నిర్వర్తిస్తారు.

## "శ్రాద్ధ కర్మ" 'క్రమము'

ఏ శ్రాద్ధ విధానము పాటించినా శ్రాద్ధ కర్మ "క్రమము" స్థూలంగా క్రింది విధముగా వుంటుంది.

- విచ్ఛిన్నోపాసనము, అగ్ని పునస్సంధానము (కర్త అగ్నిని ఆరాధించి శ్రాద్ధ కర్మ చేయుటకు అర్హత పొందుటకు)
- పితృదేవతలకు దీపారాధన
- శ్రాద్ధ సంకల్పము (చేయబోవు శ్రాద్ధ విధానము ప్రకటన)
- ముందుగానే నిమంత్రించిన భోక్తలను వసురుద్రాదిత్య రూపులైన పితృ దేవతలు, విశ్వేదేవులు, శ్రాద్ధ సంరక్షక శ్రీ మహావిష్ణువుగా భావించి స్వాగతించుట, ఆవాహన, పాదప్రక్షాళన, అర్చన, అర్ఘ్యములు,

- అగ్నౌకరణము (అన్నమును అగ్నికి సమర్పించుట), భోక్తలకు భోజనము, వారి భోజనానంతరము వికిరపిండ ప్రదానము
- వర్గ త్రయమునకు పిండప్రదానము, పిండ పూజ, పిండోద్వాసన
- శ్రాద్ధమునకు విచ్చేసిన పితృదేవతలను విశ్వేదేవులు, శ్రాద్ధ సంరక్షకుని తిరిగి పితృలోకమునకు సాగనంపుట (ఆసీమాంతము)
- కర్త, కుటుంబ సభ్యుల భోజనము

## శ్రాద్ధము – వసు, రుద్ర, ఆదిత్య రూపములు – శాస్త్రీయత

భూవాతావరణాన్ని కాపాడే పనిని వసువులు అనబడే శక్తులు ఎనిమిది రకాల పనులుగా పర్యవేక్షిస్తుంటారు. కనుక వారిని అష్టవసువులు అంటారు. ఆధునిక భాషలో చెప్పాలంటే అష్టవసువులు స్ట్రాటోస్ఫియర్ను రక్షించే ప్రకృతి లోని శక్తులు.

స్ట్రాటోస్ఫియర్నే మనం వసులోకం అంటాం. వసురూపములో వుండే పితృశక్తి అష్టవసువుల ఆజ్ఞలకు లోబడి భూలోకాన్ని కాపాడుతూ ఉంటుంది.

ప్రతి సాంవత్సరీక శ్రాద్ధమునందు పెట్టు మూడు పిండాలలో మొదటిది వసు రూపములో వుండే తల్లి లేదా తండ్రి ఆకలిని తీరుస్తుంది. రెండో పిండం నాయనమ్మ లేదా తాత (పితామహుని) ఆకలిదప్పులను తీరుస్తుంది. వారు రుద్ర రూపములో రోదసిలో వుంటారు. రోదసిని ఏకాదశ రుద్రులు కాపాడుతూ ఉంటారు. తద్దినం పెడుతున్న వ్యక్తి నాయనమ్మ/ తాత ఏకాదశ రుద్రుల ఆజ్ఞలకు లోబడి రోదసి సంరక్షణ చేస్తుంటారు.

మూడో పిండం తాతమ్మ లేదా ప్రపితామహుడి (తాత తండ్రి) ఆకలి దప్పులు తీరుస్తున్నది. వారు ఆదిత్య రూపులు. ద్వాదశాదిత్యులు ఈ లోకాలకు కావలసిన సూర్యరశ్మిని ప్రసరింపజేస్తుంటారు. ఆదిత్యరూపధారులైన పితరులు (పితృ శక్తులు) ద్వాదశాదిత్యులకు సహాయకారులుగా ఉంటారు.

వ్యక్తి మరణించి వసు రూపం పొందినప్పుడు, అతని మరణించిన తండ్రి వసు రూపం నుండి రుద్ర రూపానికి, మరణించిన తాత రుద్ర రూపం నుండి ఆదిత్య రూపానికి,

మరణించిన ముత్తాత ఆదిత్య రూపం నుండి 'స్వర్గ పాథేయ' కార్యక్రమం వలన స్వర్గము (సువర్లోకము) చేరుకుంటారు. (ఇక్కడ స్వర్గము అనగా పుణ్య కార్యములు చేసినందువలన లభించే స్వర్గము కాదని, భూమిపై వున్నవారికి నాల్గవ తరం వారు కనుక జ్ఞాపకములుగా కూడా మిగలకుండా పంచ భూతములలో లయమయ్యే స్థితి - అదియే 'అక్షయ పుణ్య లోకము' గా భావించాలి)

మరణించిన మూడు తరాల పూర్వజులు మాత్రమే జ్ఞాపకాలుగా వుండ గలుగుతారు. అందుకే పితరులను మూడు స్థాయిలలో - వసు, రుద్ర, ఆదిత్య - రూపములలో వారి కాలమానములో ప్రతి రోజూ (మానవుల కాలమానములో ప్రతి సంవత్సరము) శ్రద్ధగా ఆహ్వానించి, పాద ప్రక్షాళన చేసి, యధాశక్తి అర్చించడానికి వారికి మారుగా భోక్తలను నిమంత్రించి, వారు వచ్చినట్టు సంకల్పించి, అర్చించి, భోక్తలకు భోజనము పెట్టే శ్రాద్ధము (పితృయజ్ఞము) ఆచరించాలి.

శ్రాద్ధప్రక్రియను కూడా వేదోక్తము (మంత్రములతో సవివరముగా), పురాణోక్తము (సరళమైన సంస్కృత మంత్రములు, శ్లోకములతో) అనే రెండు విధానములలో వీలయ్యే ఒక విధానంతో యథాయోగ్యముగా చేయుటకు ఋషులు అవకాశం కల్పించారు.

## వేదోక్త విధానములో శ్రాద్ధములు

ఆపస్తంబ గృహ్యసూత్రములలో ఆచారకాండలో ఐదు రకాల శ్రాద్ధములున్నవి.

1. సాపిండీ (పిండ ప్రదానం)
2. సంకల్ప (ఇద్దరు బ్రాహ్మణులకు సంకల్ప పూర్వకంగా పెట్టేది)
3. బ్రాహ్మణ భోజన (ఒక బ్రాహ్మణునికి తర్పణం సంకల్ప సహితంగా)
4. ఉపాదాన (స్వయంపాకం)
5. అశ్రుశ్రాద్ధేషు (చెయ్యలేకపోతున్నా తండ్రీ అని అశ్రువులతో చెప్పుకోవడం)

వీటిలో క్రమంగా ఒకదానికంటే ఒకటి, ఒక్కొక్క మెట్టు తక్కువది.

## సాధారణంగా వాడుకలో వున్న శ్రాద్ధ విధానములు

**సాపిండీ - మాసి శ్రాద్ధము :** పైన వివరించిన 'శ్రాద్ధ కర్మ క్రమం' ప్రకారం వర్గత్రయమునకు ముగ్గురు (వసు, రుద్ర, ఆదిత్య), విశ్వేదేవులకు ఇద్దరు, శ్రాద్ధ సంరక్షక

శ్రీ మహావిష్ణువునకు ఒకరు చొప్పున ఆరుగురు భోక్తలకు ఆవాహనాది ఆరాధన చేస్తూ ప్రత్యేకముగా శ్రాద్ధ హోమం కూడా చేస్తారు. కొందరు, వర్గ త్రయమునకు, విశ్వేదేవులకు, శ్రాద్ధ సంరక్షక శ్రీ మహావిష్ణువునకు, కనీసం ఒక్కొక్కరి చొప్పున ముగ్గురు భోక్తలకు ఆవాహనాది ఆరాధన చేస్తారు.

శ్రాద్ధ క్రియ ఇంకా వివరంగా మరియు ఎక్కువ మంత్రములతో వుంటుంది.

భోక్తలకు భోజనము వడ్డించునపుడు, వారు భోజనము చేయునపుడు అన్న సూక్తము, త్రిసుపర్ణమ్, అరుణము, కూష్మాండ సూక్తము, అధిశ్రవణము మొదలైన వేద సూక్త మంత్రములను యథాశక్తి పఠిస్తారు.

ఈ విధానములో శ్రాద్ధం ఆచరిస్తున్నపుడు కర్తకు మంచి సంస్కృత భాషా పరిజ్ఞానము వుండి, చదివే మంత్రములను అర్థం చేసుకోగలిగితే ఈ విధానంలో శ్రాద్ధం ఆచరించడం సార్థకమవుతుంది.

**సాపిండీ - పార్వణ విధానము :** ('పర్వ' శబ్దమూలముతో) 'శ్రాద్ధకర్మ క్రమము' పాటిస్తూ చేయు శ్రాద్ధము. సాధారణంగా వర్గత్రయమునకు, విశ్వేదేవులకు, శ్రాద్ధ సంరక్షక శ్రీ మహావిష్ణువునకు ఒక్కొక్కరి చొప్పున ముగ్గురు భోక్తలకు ఆవాహనాది ఆరాధన చేస్తూ శ్రాద్ధము నాచరించుట. భోక్తలకు భోజనము వడ్డించునపుడు, వారు భోజనము చేయునపుడు అన్నసూక్తము, త్రిసుపర్ణమ్, అరుణము, కూష్మాండ సూక్తము, అధిశ్రవణము మొదలైన వేదసూక్త మంత్రములను యథాశక్తి పఠిస్తారు.

**సంకల్ప-బ్రహ్మార్పణ విధానము :** 'శ్రాద్ధ కర్మ క్రమము' పాటిస్తూ, పిండ ప్రదానం లేకుండా కనీసము వర్గత్రయమునకు ఒకరు, విశ్వేదేవులు శ్రాద్ధ సంరక్షకులకు కలిపి ఒకరు, మొత్తం ఇద్దరు భోక్తలతో చేయు శ్రాద్ధము. ఇందులో వేద సూక్త పఠనము వుండదు.

**చటక శ్రాద్ధము (హోమకల్ప విధానము) :** పార్వణ, బ్రహ్మార్పణ విధానములతో ప్రత్యాబ్దికము చేయుట వీలు కానప్పుడు సాలగ్రామమును లేదా కూర్చను (దర్భతో చేయునది) భోక్తలుగా భావించి క్లుప్తముగా ఆచరించు 'శ్రాద్ధ కర్మ క్రమము'. ఈ మధ్య కాలములో మఠములలో/సత్రములలో సామూహికంగా ఈ శ్రాద్ధ విధానము పాటిస్తున్నారు.

## శ్రాద్ధ కర్త 'అశక్తత' - ప్రత్యామ్నాయ శ్రాద్ధములు

కర్త శ్రాద్ధ కర్మ చేయుటకు అశక్తుడైనప్పుడు (ముఖ్యముగా అనారోగ్యము వలన), అనగా అన్నమువండి పార్వణవిధానముతో శ్రాద్ధము ఆచరించ లేనప్పుడు-

**బ్రాహ్మణభోజన-సంకల్ప శ్రాద్ధము :** పితృ, విశ్వేదేవాదుల అవాహనాది అర్చన లేకుండా, సంకల్పమాత్ర విధిగా భోజనము పెట్టి ఆచరించు శ్రాద్ధము.

**ఉపాదాన-ఆమ శ్రాద్ధము:** భోజనమునకు కావలసిన సకల పదార్థములు - బియ్యము, కూరలు, పప్పు దినుసులు, నెయ్యి, పెరుగు మొదలైనవి, భోక్తలకు ఇచ్చి ఆచరించు శ్రాద్ధము.

**ఉపాదాన - హిరణ్య శ్రాద్ధము:** బంగారము కానీ, ధనము కానీ భోజనమునకు ప్రత్యామ్నాయముగా భోక్తలకు ఇచ్చి ఆచరించు శ్రాద్ధము

కర్తకు ఏ వసతీ లేనప్పుడు తిల తర్పణము మాత్రము చేసి శ్రాద్ధము నాచరించ వచ్చును. తిలలు కూడా లేని దారిద్ర్యమున్నచో ?

ఊరి వెలుపలకు వెళ్లి చేతులు పైకి చాచి "ఓ పితృదేవతలారా, నేను దారిద్ర్య పీడితుడనై ఆహారము లేక శుష్కించుచున్నాను. నా కన్నీటిని మీరు స్వీకరించి తృప్తులగుదురు గాక యని రోదించుట, అశ్రు శ్రాద్ధము.

పైవేవీ ఆచరించక శ్రాద్ధ త్యాగము చేసిన వాడు జీవనీయుడు కాదని స్కాంద పురాణము చెప్పుచున్నది. అనగా ప్రతీ మనిషి తన పితరులను వీలైన విధానములో స్మరించుకోవడం అవసరము.

## శ్రాద్ధములు - దైవత్యములు (అర్చనా స్థానములు)

శ్రాద్ధమొనరించు కర్త/లు శ్రాద్ధమునకు ఆవాహన చేయు పితృదేవతల సంఖ్య (దైవత్యము) క్రింది విధంగా ఉంటుంది. అన్నింటిలోనూ శ్రాద్ధ సంరక్షక శ్రీ మహావిష్ణువు స్థానం వుంటుంది

1. ప్రతి సాంవత్సరీక పితృ శ్రాద్ధము - పితృ, పితామహ, ప్రపితామహ త్రయము (మూడు స్థానములు), పురూరవ, ఆర్ద్రవ విశ్వేదేవ సహితముగా
2. ప్రతి సాంవత్సరీక మాతృ శ్రాద్ధము - మాతృ, పితామహి, ప్రపితామహి త్రయము (మూడు స్థానములు), పురూరవ, ఆర్ద్రవ విశ్వేదేవ సహితముగా

3. షణ్ణవతి శ్రాద్ధములలో సపత్నీక (భార్యలతో సహా) పితృ వర్గము (3+3), సపత్నీక (భార్యలతో సహా) మాతామహ వర్గము (3+3), అను షడ్ దైవత్యము, (ఆరు స్థానములు) ధను, రుచి విశ్వేదేవ సహితముగా, పిండ రహితముగా (మహాలయ, తిస్రోష్టకల శ్రాద్ధములు తప్పించి) ఆచరించవలెను.

4. **"మహాలయే గయా శ్రాద్ధే వృద్ధౌచాన్వష్టకాసుచ, నవదైవత మత్రేష్టం శేషం షాట్పౌరుషమ్ విదుః"** మహాలయ పక్ష శ్రాద్ధములలో మరియు తీర్థ శ్రాద్ధములలో పిత్రాది త్రయము, మాత్రాది త్రయము, మాతామహ త్రయము, మాతామహి త్రయము - నవ దైవత్యము (9 స్థానములు) నర్చించవలెను.

**"మహాలయే గయా శ్రాద్ధే, మాతాపిత్రోర్మృతేహని,**
**కృతో ఉద్వాహోపి కుర్వీత పిండదానం యధావిధి"**

మహాలయ, తిస్రోష్టకలలో శ్రాద్ధములు పిండ సహితముగా ఆచరణీయములు.

మహాలయ పక్షములో ఒక్కరోజు శ్రాద్ధము ఆచరించినప్పుడు సర్వ దైవత్యముగా, (అనగా మాతృ త్రయ, పితృ త్రయ, సపత్నీక మాతామహ త్రయము, ఆత్మపత్న్యాది సర్వ కారుణ్య వర్గము) చేయవలెను.

మహాలయ పక్ష శ్రాద్ధములలో 16 వది - సకృన్మహాలయము - ఆశ్వీజ శుక్ల పాడ్యమి తిథి నాడు కేవల మాతామహుల నుద్దేశించి ఆచరించునది.

## శ్రాద్ధ భోక్తల సంఖ్య

వేదోక్తముగా చేసే విధానములో, ఇటీవలి కాలములో, సాధారణంగా, శ్రాద్ధతిథి రోజు పితృస్థానం నిమిత్తం ఒక భోక్తను, విశ్వేదేవుల స్థానం నిమిత్తం ఒక భోక్తను, శ్రాద్ధ సంరక్షక శ్రీ మహావిష్ణు స్థానం నిమిత్తం ఒక భోక్తను మొత్తం ముగ్గురు భోక్తలను నియమిస్తారు. పురూరవ, ఆర్ద్రవ అనే పేర్లున్న ఇద్దరు విశ్వేదేవులు విశ్వేదేవ భోక్తను ఆవహించి ఆనాటి కర్మ ఫలాలను పితరులు పితృలోకాలకు కొనిపోవుటకు సహకరిస్తారు.

పూర్వ కాలములో పితృ స్థానములో ముగ్గురిని, విశ్వేదేవుల స్థానంలో ఇద్దరిని, శ్రాద్ధసంరక్షకుడి స్థానంలో ఒకరిని - మొత్తం ఆరుగురు భోక్తలను నియమించే వారు. ఈ మధ్య కాలములో, కేవలం ఇద్దరు భోక్తల నియామకంతోనే (పితృ స్థానములో ఒకరు, విశ్వేదేవ, శ్రాద్ధ సంరక్షకుల స్థానములో ఒకరు) శ్రాద్ధం నిర్వర్తిస్తున్నారు.

# శ్రాద్ధ ముఖ్య నియమములు

## గృహ పరిసరములు

- శ్రాద్ధమునాడు గృహమందు రంగవల్లులు, భోక్తలు, కర్త/లు, పాకము చేయువారు, వడ్డించువారు తమ ముఖమున కుంకుమ ధారణ చేసి ఉన్నయెడల పితృదేవతలు వెళ్లిపోవుదురు.
- తులసీదళములు, మారేడు దళములు, ఎఱ్ఱని పుష్పములు, పరిమళమునిచ్చు మొగలి, జాజి వంటి పుష్పములు ఉపయోగించకూడదు.
- ఘంటానాదము, కలహవాతావరణము, హుంకారములు, పరిహాసవచనములు, రోదనము, వచింపరాని సంభాషణలు వినినచో పితృదేవతలు వెళ్ళిపోవుదురు.

## శ్రాద్ధములందు వుండవలసిన పిండ ప్రమాణము:

ఏకోద్దిష్టము, సపిండీకరణము యందు వెలగపండు పరిమాణముతో, ప్రత్యాబ్ది కములు, మాసికములందు కొబ్బరి కాయంతగా, సంక్రమణ, గ్రహణ శ్రాద్ధముల యందు కోడి గుడ్డు పరిమాణముతో, తీర్థ శ్రాద్ధము, మహాలయ శ్రాద్ధము, గయా శ్రాద్ధము, మన్వాదుల యందును ఉసిరి కాయ ప్రమాణముతో, అన్న పిండములను జేయవలయును. పితృ పిండమునందు మినుములు వుండకూడదు.

**పాత్రాణాం బాహు మాత్రేణ పిండదానం విధీయతే** - బ్రాహ్మణ భుక్త పాత్రలకు బారెడు దూరముగా పిండప్రదానం చేయవలయును.

## శ్రాద్ధాంగ తర్పణములు :

- శ్రాద్ధముల యందు తర్పణములకు అత్యంత ప్రాధాన్యత ఇవ్వబడినది. పవిత్రము ధరించి ప్రాచీనావీతియై తిలలతో పితృదేవతల పేర్లు, రూపములు ఉచ్చరిస్తూ వారికి **“అక్షయ్యా పుణ్యలోకావాప్త్యర్థం”** (శాశ్వతంగా పుణ్య లోకములందు వుండుటకు) నీరు వదలడమును తిలతర్పణం అంటారు.
- శ్రాద్ధము ఆచరించిన పిదప వెంటనే కానీ మరునాడు ఉదయమే కానీ తిల తర్పణములు వదలుటకు వేరు వేరు నియమాలున్నాయి.

- మృతుని ప్రథమాబ్దికము వరకు చేయు ఏ విధమైన శ్రాద్ధమునకైనా తర్పణములు వుండవు.
- తీర్థ శ్రాద్ధములందు, గయా క్షేత్రములో ఆచరించు శ్రాద్ధమందు, శ్రాద్ధము తరువాత తర్పణములు వుండవు.
- ప్రత్యబ్ద శ్రాద్ధము రోజున తర్పణము చేయకుండా మరునాడు ఉదయమే వర్గత్రయమునకు మాత్రమే శ్రాద్ధాంగ తర్పణము విడువాలి.
- కొన్ని షణ్ణవతీ శ్రాద్ధములలో శ్రాద్ధము ఆచరించుటకు ముందే తర్పణములు విడువాలి. ఈ విషయములో ఆబ్దిక మంత్ర సంబంధ గ్రంధములలో మరింత వివరణ పొందవచ్చును.

## శ్రాద్ధ స్థల శుద్ధి – శ్రాద్ధ పిండ నిక్షేపణ

శ్రాద్ధ పిండములను గోవులకు మేకలకు బ్రాహ్మణులకు పెట్టవచ్చును. జలములోనైనా ఉంచవచ్చును.

## వికిరపిండ నిక్షేపణ

వికిరపిండమును, బ్రాహ్మణోచ్ఛిష్టమును గోవులకు మేకలకు యితరులకు నియ్య గూడదు. జలము నందుంచ గూడదు. భూమి యందు గొయ్యి త్రవ్వి దానిలో పూడ్చ వలయును.

## భోజన పాత్రల ఉచ్చారము (ఎత్తి వేయడం)

శ్రాద్ధమునందు భోక్తల పాత్రలను కర్త /లు గానీ, వారి శిష్యులు గానీ, కుమారులు గానీ తీసివేయవలయును. స్త్రీలు గానీ, బాలురు గానీ, మఱియొక వంశమునందు బుట్టిన వారు కానీ తీసివేయకూడదు.

ఈ రోజులలో కూతుళ్లు, కోడళ్ళు, మనుమలు, మనుమరాళ్ళు ఎవరైనా ఈ పని ఒక ఆత్మీయతా భావంతో తమ ధర్మంగా చేస్తున్నారు. ఇది స్వాగతించతగినదే.

## శ్రాద్ధ ఆశీర్వాద అక్షతలు

శ్రాద్ధమునందు బ్రాహ్మణులచే ఆశీర్వచనముజేసి ఇవ్వబడిన అక్షతలను అందరును శిరస్సున ధరించవచ్చును. ప్రేతకర్మల యందు యజమాని (కర్త/లు) మాత్రమే ధరించ వలయును.

# పురాణోక్త విధానములో పితృ కార్యములు

ప్రాచీన శాస్త్రజ్ఞులైన ఋషులు, వేదోక్త విధానంలో కర్మలు ఆచరించుట నిరంతరం ప్రకృతి పరిశోధనలో వుండే బ్రాహ్మణ వర్ణము వారికి మాత్రమే పరిమితం చేసి సంఘంలో అన్ని వర్ణములవారికి పురాణోక్త విధానంలో కర్మలు ఆచరించుటకు నియమాలు ఏర్పరచారు.

సార్ధక సంఘ జీవితమునకు కావలసిన శాస్త్ర పరిజ్ఞానము వుండి సంఘములో వున్న అన్ని వర్ణముల వారికీ సరి అయిన మార్గదర్శనము చేయు వారిని పురోహితుడు అంటారు. అందువలన, పురాణోక్త విధానములో దేవపితృ కార్యములన్నీ పురోహితుడి సహకారముతో చేయు పద్ధతిని ఏర్పరిచినారు.

ఈ విధానములో కర్మలు ఆచరించువారికి అర్ధమయ్యే విధముగా మంత్రములను సమకూర్చినారు. కార్యక్రమములలో వుండే క్రియాక్రమమును కూడా సరళీకరించి క్రింద తెలిపిన విధముగా పితృ కార్యములు చేయుటకు విధి విధానములు నిర్ణయించినారు. అవి:

1. **అంత్యేష్టి, 12 రోజుల కర్మకాండ, మాసికములు, సంవత్సరీకము :** సామాజిక జీవన విధానములు, అవసరములు ప్రాతిపదికగా, అంత్యేష్టి మూడు దశలనూ సరళీకరించి, దైనందిన జీవన విధానమునకు అనుకూలముగా, సౌకర్యముగా వుండునట్లు ఏర్పరచి నారు. పురోహితుడి మార్గదర్శనము మరియు సహకారముతో ఈ సంస్కారము నిర్వ హిస్తారు. ప్రాంత భేదములు వున్నా, మృతా శౌచము పాటిస్తూ 12 రోజుల కర్మకాండ నిర్వర్తిస్తారు. సపిండీకరణంలో 'వసు రుద్ర ఆదిత్య' కు బదులుగా ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవ అని గానీ, ప్రధమ, ద్వితీయ తృతీయ పితృ రూప అని గానీ పితరులను సంబోధిస్తారు.

2. **సంవత్సర శ్రాద్ధము :** మరణించిన తల్లి, తండ్రులకు – ప్రతి సాంవత్సరీక శ్రాద్ధము. మరణించిన మాసము, తిథి వున్నరోజు, పురోహితుడి మార్గదర్శనము మరియు సహకారము తో సరళీకరించిన శ్రాద్ధ కర్మ క్రమం ఆచరిస్తారు. సాధారణంగా ఆమశ్రాద్ధ విధానంగా పురోహితుడికే పితృదేవతలు, విశ్వేదేవతల స్వరూపంగా పాదప్రక్షాళన చేసి వారి వారి స్థానములలో ఆకులు వేసి శ్రాద్ధ కర్మ క్రమం ఆచరిస్తారు.

3. **తీర్థ శ్రాద్ధము :** కర్త/లు తీర్థ యాత్రలు చేస్తున్నపుడు తాము దర్శించే తీర్థము/క్షేత్రము/ నదీతీరములో పితృ దేవతలందరికీ (సర్వ కారుణ్య వర్గము), వెళ్లిన ప్రదేశములో ఆచరిస్తారు.

**4. మహాలయ శ్రాద్ధము :** (మహాలయ పక్షంలో సర్వ దైవత్యముగా – ప్రతి సంవత్సరము). "పెద్దలకు ఏడాదికో రోజు" అన్న భావనతో చాలా శ్రద్ధగా ప్రతిసంవత్సరం భాద్రపద అమావాస్య నాడు (సర్వపితృ అమావాస్య – పెతరమాస), చనిపోయిన తమ పెద్దల పేరు మీద పురోహితులకు, ఆలయములలో అర్చకులకు దానధర్మములు చేస్తారు.

వేదోక్త విధానములో నిర్దేశించిన, నిత్యపితృ తర్పణం, షణ్ణవతీ శ్రాద్ధములు మొదలగునవి ఏవీ పురాణోక్త విధానములో వుండవు.

## గయా శ్రాద్ధము – పంచ గయలు

వాయు పురాణం, భాగవత పురాణం ప్రకారం– త్రేతాయుగకాలములో, గయా సురుడు ప్రసిద్ధి చెందిన తపస్వి, రాక్షసుడు. మహా విష్ణుభక్తుడు, తన తపోశక్తిచే తన శరీరమును పరమ పవిత్రంగా మలచుకుని, దానిని తాకిన ఏ ప్రాణి అయినా ముక్తి పొందేలా చేసుకో గలిగిన వాడు. అయితే, వైదిక కర్మలు నశించి వాటి పునరుద్ధరణకు బ్రహ్మాదులు యజ్ఞము చేయవలసి వచ్చినప్పుడు గయుని శరీరము పై బ్రహ్మ చేసిన యజ్ఞము తరువాత మూడు భాగములైన తన శరీరం దివ్య క్షేత్రాలుగా, సకల తీర్థాలకన్నా పరమ పవిత్రంగా పితరులను తరింపజేసే దివ్యధామాలుగా మారడానికి కూడా శ్రీ మహావిష్ణువుచేత వరం పొందాడు. ఆ వరప్రభావముతోనే యజ్ఞానంతరం శరీరము శిరస్సు, నాభి, పాదములు అనే మూడు భాగములు గా పడిన ప్రదేశములు, శిరోగయ, నాభిగయ, పాదగయ అనే మూడు గయా క్షేత్రములుగా ప్రస్తుతం బుద్ధగయ (బీహార్), జాజిపూర్ (ఒరిస్సా), పిఠాపురం (ఆంధ్రప్రదేశ్) అనే పేర్లతో వున్నాయి.

వీటితో పాటు ప్రస్తుతము గుజరాత్ రాష్ట్రములో వున్న మాతృగయ (సిధ్‌పూర్), హిమా లయములలో నరనారాయణులు తపమాచరించిన బదరీనాథ్ క్షేత్రములో వున్న బ్రహ్మ కపాలము అనే రెండు క్షేత్రములు కలిపి పితృ యజ్ఞము చేయవలసిన పంచ గయలుగా ప్రసిద్ధి చెందినవి.

పితరులకొరకు ఈ పంచ గయాక్షేత్రములలో తీర్థ శ్రాద్ధము ఆచరించినట్లైతే వారు మరింత ప్రీతులవుతారని, శిరోగయా క్షేత్రములో మరియు బ్రహ్మ కపాలములో శ్రాద్ధము నాచరించిన వారి పితరులకు శాశ్వత పరబ్రహ్మ లోక ప్రాప్తి కలుగుతుందని పురాణ వచనము.

అందుకే గయాశ్రాద్ధమునకు అత్యంత ప్రాముఖ్యత నిచ్చి శ్రాద్ధమును ఎక్కడ ఆచరించినా "గయా శ్రాద్ధ ఫలితమస్తు" అని బ్రాహ్మణులచే దీవెనలు పొందుతారు.

వనరులు, వసతులు వున్నాయి కదా అని మాసికములు, సంవత్సరీకములు నిర్వర్తించ డానికి గయా క్షేత్రములకు ప్రత్యేకముగా వెళ్ళకూడదు. గయా క్షేత్రములలో శ్రాద్ధములు మాత్రమే ఆచరించాలి.

గయా శ్రాద్ధము ఆచరించిన తర్వాత ప్రతి సంవత్సరము పితృ శ్రాద్ధములు పెట్టవలసిన అవసరం లేదని కొందరు మిడిమిడి జ్ఞానముతో అంటూ వుంటారు. ఇది ఎంతమాత్రమూ సరి కాదు. గయా క్షేత్రములో శ్రాద్ధము నాచరించడం విశేషమే కానీ నిత్యమూ జీవించి ఉన్నంత కాలము చేయవలసిన పితృ యజ్ఞమునకు "ఉద్యాపన" కాదు. కర్త జీవించి వున్నంతవరకూ పితృ యజ్ఞము (సంవత్సర శ్రాద్ధములు, మహాలయ పక్ష శ్రాద్ధములు, తీర్థ శ్రాద్ధములు మొ.) కొనసాగిస్తూనే వుండాలి.

## మాతృ గయ-విశిష్టత

గుజరాత్ రాష్ట్ర రాజధానీ నగరం అహ్మదాబాద్ కు ఉత్తరంగా 120 కి.మీ. దూరములో ప్రస్తుతం 'సిధ్ పూర్' అని పిలువబడే పట్టణమే మాతృగయ క్షేత్రము. ఇక్కడే ఇంద్రుడికి ఆయుధముగా మార్చుకొనుటకు దధీచి మహర్షి తన అస్తికనిచ్చినట్లు చెప్తారు. ఈ క్షేత్రము గంగా సరస్వతీ నదుల సంగమంగా చెప్పబడుతున్నా ప్రస్తుతము సరస్వతీ నది అని చెప్పబడే ఒక నదీప్రవాహ చిహ్నములు మాత్రము స్పష్టముగా వున్నాయి. ఇక్కడ సరస్వతీ ఘాట్, సరస్వతీ మందిరం కూడా వున్నాయి.

ఈ క్షేత్రములో బిందు సరోవరం అనే కోనేరు వున్నది. ఇది ప్రాచీన కాలము నుండీ భావించే ఐదు పవిత్ర సరోవరములలో ఒకటి. (మిగిలినవి: టిబెట్ లోని మానస సరోవరం, రాజస్థాన్ లోని పుష్కర్ సరోవరం, గుజరాత్ లోనే కచ్ ప్రాంతములో వున్న నారాయణ సరోవరం, కర్ణాటక లో వున్న పద్మ సరోవరం).

ఇక్కడి బిందుసరోవరం ప్రాంగణములోనే -

కన్నతల్లి, నానమ్మ, తాతమ్మ ఈ ముగ్గురికి మూడు పిండాలు, కన్నతల్లి శిశువును గర్భంలో ధరించినప్పుడు పడిన కష్టములు గుర్తు చేసుకుంటూ వాయు పురాణములోని మాతృ షోడశీ శ్లోకములతో 16 పిండాలు, శ్రాద్ధ కర్తకు కారుణ్య వర్గములో వచ్చే స్త్రీమూర్తులందరికీ, అనగా - తండ్రి అక్క చెల్లెళ్లు, తల్లి అక్క చెల్లెళ్లు, సొంత అక్క చెల్లెళ్లు, కూతుళ్లు, పిల్లనిచ్చిన అత్తగారు - వీరందరికీ ఒక ధర్మ పిండం, మాతృగయ

క్షేత్రానికి ఒక పిండము, మొత్తం 21 పిండాలు పెట్టిస్తారు. ఇది మాతృగయలో ఆచరించ వలసిన ప్రత్యేక మాతృగయ తీర్థ శ్రాద్ధం.

ఈ క్షేత్రములో స్థానిక సంప్రదాయము ప్రకారము, ఇక్కడ ఆచరించే ప్రత్యేక తీర్థ శ్రాద్ధములో పురుషులైన పితరుల గురించి పిండప్రదానము వుండదు.

"మాతృషోడశి" తల్లిదనానికి ఇచ్చే నివాళి. ముందుగా తనను బీజదశనుండి భూమి మీదకు సాకారంగా తీసుకువచ్చేదాకా, తర్వాత మనిషిగా తీర్చి దిద్దే క్రమంలో తల్లి పడే బాధలూ, కష్టాలూ ప్రతిబిడ్డకీ ఒకసారి గుర్తుచెయ్యడమేగాక, తను ఎంతచేసినా తల్లిరుణం తీర్చుకోలేదని, అందువల్ల తను చేసే ఈషణ్మాత్రపు సేవలను ఎక్కువగా అంచనా వేసుకోవద్దని బిడ్డలకు విశదపర్చే భావన తో ఈ 16 శ్లోకాలు వుంటాయి.

ఈ వాయు పురాణాంతర్గత 16 శ్లోకాలు తెలుగు తాత్పర్యముతో క్రింది విధంగా వున్నవి.

**1 గర్భస్య ధారణే దుఃఖం , విషమే భూమి వర్త్మని,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

గర్భం ధరించడమే దుఃఖం. దానికితోడు ఎగుడుదిగుడు నేల మీద నడవడం అంతకన్న కష్టం. ఆ కష్టం కలిగించి నందుకు ప్రతిగా ఈ మాతృపిండాన్ని సమర్పిస్తున్నాను.

**2 యావత్ పుత్రో న భవతి తావత్ మాతుశ్చ చింతనమ్,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

సంతానం కలిగేదాకా తల్లి చింతతో బాధ పడుతుంది. అటువంటి చింత కలిగించి నందుకు ప్రతిగా ఈ మాతృ పిండాన్ని నీకు సమర్పిస్తున్నాను.

**3 మాసి మాసి కృతం కష్టం, వేదనా ప్రసవేషుచ,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

ప్రసవ పర్యంతం నెల నెలా కష్టం కలిగించినందుకు ప్రతిగా ఈ మాతృపిండాన్ని నీకు సమర్పిస్తున్నాను.

**4 సంపూర్ణే దశమే మాసి అత్యంతం మాతృ పీడనం,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

పది నెలలు నిండిన తర్వాత, తల్లివైన నీకు ఎక్కువ కష్టం కలిగించినందుకు ప్రతిగా ఈ మాతృపిండాన్ని నీకు సమర్పిస్తున్నాను.

**5 పాదాభ్యామ్ తాడయేత్ పుత్రః జనన్యాః పరివేదనమ్,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

తల్లివైన నీకు కష్టం కలుగుతుందన్న ఆలోచన లేక, గర్భంలో ఉన్నప్పుడూ, బయటపడిన తర్వాత కూడా, కాళ్ళతో తన్నినందుకు ప్రతిగా ఈ మాతృ పిండాన్ని నీకు సమర్పిస్తున్నాను.

**6 శైథిల్యం ప్రసవే ప్రాప్తే, మాతా విందతి దుష్కరం,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

ప్రసవం అయిన దగ్గరనుండి చిక్కి శల్యమైపోయినా, నాకు ఎన్నో సేవలు చేయవలసి వచ్చింది. అందుకు ప్రతిగా ఈ మాతృ పిండం నీకు సమర్పిస్తున్నాను.

**7 అగ్నినా శోషయేత్ దేహం, త్రి రాత్రో పోషణం చ యత్,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

మరణం తర్వాత మూడు రాత్రులు దేహం అగ్నిలో శోషిస్తుంది ఆహారం లేక. అందుకు ప్రతిగా నీకు ఈ మాతృ పిండాన్ని సమర్పిస్తున్నాను.

**8 పాపౌ యా కటు ద్రవ్యాణి వ్యయాణి,క్వాథాని వివిధాని చ,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

ఇది అది అనకుండా అన్నిరకాలైన చేదు, కషాయాలూ తినడం, తాగడం చెయ్యవలసి వచ్చింది నావల్ల. అందుకు ప్రతిగా ఈ మాతృ పిండాన్ని నీకు సమర్పిస్తున్నాను.

**9 అహర్నిశం తు యన్మాతుః స్తన పీడా మదామహం**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

రాత్రి పగలు అన్న తేడా లేకుండా నాకు నీ స్తన్యాన్ని ఇవ్వమని వేధించినందుకు ప్రతిగా నీకు ఈ మాతృ పిండాన్ని సమర్పిస్తున్నాను.

**10 రాత్రౌ మూత్ర పురీషాభ్యాం భిద్యతే మాతృ కర్పటౌ,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

రాత్రిపూట మలమూత్రాలతో నీ పక్క తడిపి నీకు సుఖం లేకుండా చేసినందుకు ప్రతిగా ఈ మాతృ పిండాన్ని నీకు సమర్పిస్తున్నాను.

**11 మాఘే మాసి నిదాఘేచ శిశిరాతప దుఃఖితా,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

చాలా దీర్ఘమైన మాఘమాసరాత్రులందు శిశిరాతపాన్ని దుఃఖాన్ని అనుభవింప చేసినందుకు ప్రతిగా ఈ మాతృ పిండాన్నినీకు సమర్పిస్తున్నాను.

**12 క్షుత్రిగ్భ్యాం వ్యాకులే పుత్రే యాన్నం నీరం ప్రయచ్ఛతి,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

ఆకలితో అలమటించిన నాకు, తినడానికో తాగడానికో ఇచ్చి రక్షించినందుకు ప్రతిగా ఈ మాతృ పిండాన్ని నీకు సమర్పిస్తున్నాను.

**13 అల్పాహారాచ యా మాతా యావథ్ పుత్రోష్టి బాలకః,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

అందరు పిల్లలూ తినగా మిగిలినదానినే అల్పాహారంగా స్వీకరించిన నీకు ప్రతిగా ఈ మాతృ పిండాన్ని సమర్పిస్తున్నాను.

**14 పుత్రే వ్యాధి సమాయుక్తే, శోకార్తా జనన్యేవాచ,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

నేను వ్యాధితో బాధపడుతున్నప్పుడు బాధపడేదానివి నువ్వే. అందుకు ప్రతిగా నీకు ఈ మాతృ పిండాన్ని సమర్పిస్తున్నాను.

**15 గాత్ర భంగో భవేన్మాతుః, మృత్యురేవ న సంశయః ,**
**తస్య నిష్క్రమణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

శరీరం కళతగ్గి మృత్యుముఖంలోకి వెళ్ళి తిరిగివస్తుంది అందుకు ప్రతిగా ఈ మాతృ పిండాన్ని సమర్పిస్తున్నాను.

**16 యమద్వారే మహాఘోరే ఖ్యాతా వైతరణీ నదీ,**
**తస్యా ఉద్ధరణార్థాయ, మాతృ పిండం దదామ్యహమ్**

యమద్వారం ముందు మహా ఘోరమైన వైతరణీ నది ఉంటుంది. ఆది నువ్వు దాటటానికి వీలుగా నీకు ఈ మాతృ పిండాన్నిసమర్పిస్తున్నాను.

మాతృగయ లో స్త్రీలు కూడా పిండ ప్రదానం చేసే ఆచారం వుండటం ఒక విశేషం.

## ఆధునిక కాలములో పితృయజ్ఞ ఆచరణ ఆవశ్యకత

ప్రాచీన శాస్త్రజ్ఞులు (ఋషులు) సనాతన ధర్మములోని సంస్కృతీ సంప్రదాయ ములను ఒక్కసారిగా నిర్దేశించలేదు. దేశ కాలములను బట్టి స్థానిక ప్రకృతి స్థితిగతులను, వాటికి అనువైన జీవన విధానమును పరిగణించి కాల క్రమంలో స్థిర పరిచినారు.

సంప్రదాయములు, దేశ కాలములను అనుసరించి సంస్కరించుకోవాలి. అవి మానవు లందరూ సంఘ జీవనంలో, స్థానిక వాతావరణ స్థితులను నిత్యజీవితములో అనుకూల ముగా చేసుకొనుటకు, వివిధ వయసులలో వున్నవారు అన్నివేళలా యథాయోగ్యముగా ఆరోగ్యముగా వుండుటకు సుఖ సంతోష సహిత జీవనమునకు నిర్దేశించబడినవి. కొంచెం లోతుగా ఆలోచిస్తే, వాటి ముఖ్యోద్దేశ్యము మానవు లందరూ వ్యక్తిగతంగా మరియు సామాజికంగా - శుచిగా, శుభ్రముగా, క్రమశిక్షణగా, మంచి ఆరోగ్యముతో జీవించడము, ఇతరులను (చుట్టూ వుండే ప్రకృతి తో సహా) జీవించనివ్వడం అని తెలుస్తుంది.

జన్యుశాస్త్ర విజ్ఞానము ప్రాతిపదికగా, కుటుంబ స్థాయిలో, కుటుంబ చరిత్రను మరియు తమ పూర్వీకులను మరువకుండా వారు అనుసరించిన జీవన విధానము ఆదర్శముగా తీసుకొని జీవించే క్రమములో పితృ యజ్ఞ సంబంధ కర్మలు నిర్దేశించబడినవి.

ఈ కర్మలు చేయడం వలన సామాజిక సంబంధాలు, రక్త సంబంధీకులతో అనుబంధం పెంపొందుతాయి. వీటి ఆచరణ, సమాజములో అవసరమైన వారికి సహాయం అందడం సునిశ్చితం చేస్తుంది.

పితృ యజ్ఞ విధానములన్నీ ఋషులు అందించిన విజ్ఞాన పునశ్చరణ మరియు ఆరోగ్య రక్షణ లక్ష్యంగా వున్నాయి.

**వ్యక్తిగత కుటుంబచరిత్ర :** సాధారణంగా ప్రతి వ్యక్తీ తన కుటుంబానికి సంబంధించిన చరిత్రను సప్రమాణంగా తన కుటుంబంలో ముందు తరాల వారికొరకు రికార్డు చేయడం లేదు. ఫోటో ఆల్బంలు కుటుంబచరిత్రను డాక్యుమెంట్ చేయడానికి ఒక వికల్పమైనా ఆ అవకాశం అందరికీ అందుబాటులో వుండదు. ఉన్నా, కాలక్రమంలో ఫోటోలు శిధిలమవుతాయి. దేశ చరిత్రను చదువు కోవడానికి అవకాశం ఉంటుంది కానీ స్వీయ కుటుంబ చరిత్ర (కనీసం మూడు తరాలది) తెలుసుకోవడానికి నేటి జీవన విధానములో

అవకాశం లేదు. సాధారణంగా ఏ కుటుంబము లోనూ గతించిన ఒక్క తరం వారి పేర్లు, ఆ తరంలో వున్న బాంధవ్యాలు కూడా గుర్తుండవు. గత పదేళ్ల కుటుంబ చరిత్ర వివరాలు కూడా భద్రము చేసుకునే పద్ధతి లేదు.

కొంచెం వాస్తవికంగా ఆలోచిస్తే, సనాతన ధర్మం నిర్దేశించిన పితృ యజ్ఞ విధానము ఈ విషయములో ఎంత ఉపయోగకరంగా వుంటుందో సులభంగానే అర్ధమవుతుంది. వర్తమాన తరానికి కావలసిన స్వీయ కుటుంబ చరిత్ర, పితరుల స్మరణ ద్వారా అవలీలగా గుర్తుకు తెచ్చుకోవచ్చును. నిత్యతర్పణాలు చేయక పోయినా మహాలయ పక్షంలో శ్రద్ధగా పితృ యజ్ఞం చేస్తే తన కుటుంబ చరిత్ర, బాంధవ్యాలు గోత్ర నామములతో సహా మరిచిపోకుండా వుండే అవకాశం వున్నది.

సనాతన ధర్మములో సుమారు వేయి సంవత్సరాలుగా సంస్కృతీ సంప్రదాయ ములకు సంబంధించిన విజ్ఞానము సమీక్షించబడలేదు, సంస్కరించబడలేదు. ఈ కారణంగానే కొన్ని సంప్రదాయములు/ ఆచారములు మూఢ నమ్మకములన్న అనుమానం వచ్చే అవకాశం ఏర్పడినది.

పితృయజ్ఞ కర్మల వెనుక వున్న శాస్త్రీయతను అర్ధం చేసుకునే దిశగా అవసరమైన పరిశోధనలు చేసి ఈ నాటి కాలమునకు కావలసిన విధముగా సంస్కరించుకొని వాటిని సమాజములో అందరూ తప్పక ఆచరించ వలసిన అవసరం వున్నది.

సనాతన ధర్మములోని ఎన్నో ధర్మ శాస్త్రాలు, స్మృతులు చదివి అర్ధం చేసుకునే అవకాశం ఇప్పుడు అందరికీ వున్నది. నేటి సామాజికవేత్తలకు, సంఘ సేవకులకు వాటిలోని విషయములను, విధి విధానములను నేటి కాలానికి అనుగుణంగా సంస్కరించుకునే అవకాశం కూడా వున్నది. వాటిలోని శాస్త్రీయతను అర్ధం చేసుకో గలిగితే సంవత్సరం లోని 365 రోజులూ 24×7 "సార్ధక" జీవన విధానం ఎలా ఉండాలో తెలిసి వస్తుంది.

# పితృయజ్ఞము - మహాలయ పక్షము- ప్రత్యేకత

ప్రతి సంవత్సరం ఆచరించే తద్దినాల కన్నా అతిముఖ్యమైనది మహాలయ పక్షం. ఇది సూర్యుడు ప్రతి సంవత్సరమూ కన్యా రాశిలో సంచరించుస్తున్నపుడు వచ్చు చాంద్రమాన భాద్రపద మాసపు కృష్ణ పక్ష కాలము. ఆశ్వయుజమాసములో ఆరంభమయ్యే దేవీ నవ రాత్రులకు ముందు వుండే పక్షము. దక్షిణాయనంలో మొదటి పండుగ వినాయక చవితి భాద్రపద శుక్ల పక్షంలో వస్తుంది. తరువాత ఆశ్వయుజమాసములో దసరా దీపావళీ పండుగలు వస్తాయి.

మహాలయ పక్షంలోని అన్ని రోజులూ పితరులకు తర్పణలు చేయలేనివారు పక్షంలో కనీసం ఒక రోజైనా చేసి తీరాలి.

గతించిన తల్లిదండ్రులకు తద్దినాలు పెట్టే అలవాటు లేనివారు సైతం ఈ మహాలయ పక్షములో తర్పణాలు వదిలి, వారి పేరు మీదుగా అన్నదానం చేసినట్లయితే పితృదేవతలకు ఉత్తమగతులు కలిగి సంతుష్టులవుతారు. వారి ఆశీస్సులతో సకల శుభాలూ కలుగుతాయి. ఈ విధానాన్ని పాటించడానికి శక్తి లేదా స్థోమత లేనివారు ఏదైనా దేవాలయంలో నైనా బియ్యం, కూరగాయలు, పండ్లు, దక్షిణ తాంబూలాదులతో స్వయంపాకం (ఆమ ద్రవ్యములు) సమర్పించాలి. ఈ విధంగా చేయడం వల్ల పితృదేవతలకు ఆకలిదప్పులు తీరి తమ వంశస్థులను సుఖశాంతులతో వర్ధిల్లమని ఆశీర్వదిస్తారు.

పితరులకు తమ వారసులు చేసే పుణ్య కార్యముల వలన తృప్తి కలిగినప్పుడే ఇహ లోకంలో వారి వంశజులకు శాంతిసౌఖ్యాలు లభిస్తాయనీ, వంశాభివృద్ధి కలుగుతుందని ప్రామాణిక శాస్త్ర గ్రంథాలయిన ధర్మసింధు, నిర్ణయసింధు చెబుతున్నాయి.

మహాలయ పక్షంలో శ్రాద్ధం ఆచరిస్తే కర్త యొక్క సప్త గోత్రీకులైన మొత్తం 101 పితరులు తరిస్తారని స్మృతులలో చెప్పబడినది. (యల్లాజీయమ్) సప్త గోత్రీకులనగా ? (అథ సప్త గోత్ర క్రమః)

**శ్లో. మాతాపితాచభార్యాచ భగినీ దుహితా తథా,**
**పితృష్వసా మాతృష్వసా సప్త గోత్రాః ప్రకీర్తితాః"**

1. తల్లి వంశీకులు (24)
2. తండ్రి వంశీకులు (20)

3. భార్య వంశీకులు (16)

4. అక్కాచెల్లెళ్ల అత్తవారి వంశీకులు (12)

5. కూతుళ్ళ అత్తవారి వంశీకులు (11)

6. మేనత్తల అత్తగారి వంశీకులు (పితృష్వస)(10)

7. తల్లి తోబుట్టువులైన (పినతల్లి పెదతల్లి) వంశీకులు (మాతృష్వస) (8)

మొత్తం 101 సప్త గోత్రములవారు మహాలయమున తరించెదరు.

మహాలయ పక్షంలో శ్రాద్ధము ఆచరించినట్లైతే కుటుంబం మొత్తానికి, పితరులు పొందే క్షోభ కారణంగా వచ్చే పితృ శాప ప్రభావము కూడా ఉపశమిస్తుంది.

## మహాలయ పక్షము - నేటి కాలములో వాస్తవ ఆచరణ :

ప్రతి మనిషీ తల్లిదండ్రులు, వారి తల్లిదండ్రులు, వారి సోదర సోదరీ వర్గములోని వారు, తన తోబుట్టువులు, భార్య/భర్త తలిదండ్రులు మరియు సోదరులు, గురువులు, ఆచార్యులు, మిత్రులు మొదలైన ఆత్మీయులతో నిత్యం ఆప్యాయత మరియు ఆదర భావంతో వుంటే జీవితం ఎంతో ప్రశాంతముగా, సుఖముగా వుంటుంది. సమస్య లేమైనా వస్తే పరస్పర సహకారంతో పరిష్కరించుకుంటారు. ఇందుకొరకే భారతీయ కుటుంబ వ్యవస్థ ఏర్పాటయ్యింది. కొంచెం లోతుగా ఆలోచిస్తే ఈ ఆత్మీయవర్గం లేదనుకుంటే జీవితానికి అర్థమే వుండదు అని తెలిసివస్తుంది కూడా.

ఈ ఆత్మీయులలో ఎవరు మరణించినా భౌతికంగా సంబంధం వుండదని పిస్తుంది కానీ ఆలోచనలలో, జ్ఞాపకాలలో బ్రతికినంతవరకూ సంబంధం వుంటూనే వుంటుంది. అది కూడా ఒక శక్తి అనే లోతైన భావన తోనే మన ఋషులు, చాంద్రమాన భాద్రపద మాసం కృష్ణ పక్షం 15 రోజులను, ప్రతి కుటుంబములోని కుటుంబ పెద్ద (కర్త) - తన చనిపోయిన తల్లిదండ్రులను, వారి తల్లిదండ్రులను, వారి సోదర సోదరీ వర్గములోని వారిని, తన తోబుట్టువులను, భార్య తలిదండ్రులు మరియు సోదరులను, గురువులను, ఆచార్యులను, మిత్రులను స్మరిస్తూ వారితో వుండే ఆత్మీయ సంబంధాన్ని కొనసాగించడానికి, అందువలన కలిగే ప్రయోజన ములు తాను, తన కుటుంబం పొందడానికి సంవత్సర కాలములో ఒక నిర్ణీత సమయముగా "మహాలయ పక్షము" ను భావించవలెనని సనాతన ధర్మ నిత్యనైమిత్తిక నియమాలలో నిర్దేశించినారు.

వాట్సాప్ వంటి మాధ్యమాలలో కుప్పలుగా వచ్చే పితృ తర్పణాలకు సంబంధించిన ఫార్వర్డ్‌లను మళ్ళీ ఫార్వర్డ్ చేస్తూ తర్పణం అంటే, పురోహితుడు మంత్రములు చదువుతుంటే పోయినవారి పేర్లు చెప్పి నీళ్లు వదలడం అనుకోకూడదు.

నిజానికి ఈ మహాలయ పక్షం లోని 15 రోజులలో ఏ ఒక్క రోజైనా తీరికగా సమయం కేటాయించుకొని, మనకు జన్యుసంబంధమున్న దగ్గరి బంధువులు ఎవరు, వారి వారి కుటుంబాలతో మనకు సమాచార సంబంధాలు వున్నాయా అని సమీక్షించుకొని, మన వంశం మరియు దగ్గరి బంధువర్గము లోని పెద్దల పేర్లను వారితో పాటు మనతో కలిసి జీవించిన మిత్రులు, ఆచార్యులు, గురువుల పేర్లను ఒక దగ్గర వరుసగా వ్రాసుకొని, మన జీవితంలో వారి వారి 'యోగదానము' (కాంట్రిబ్యూషన్) గుర్తు చేసుకొని, 'పోయిన' వాళ్లందరు సద్గతులు పొందాలని మనస్ఫూర్తిగా ప్రార్థించాలి. వంశవృక్షం వ్రాసి వుంటే, లేదా వ్రాసుకొని, రోజూ ఒకసారి దానిలోని అందరి పేర్లు, వారి గురించి చిన్నప్పుడు విన్న విశేషాలు, వారు పాటించిన జీవన విలువలు గుర్తుకు చేసుకోవాలి.

కుటుంబములోని చిన్న పిల్లలకు పూర్వీకుల గురించి వివరించాలి.

పూర్వీకులందరూ మనకు వారి జ్ఞాపకాలు వున్నంతకాలం పితృదేవతలు గా నిరంతరం మనలను చూస్తూ వుంటారని భావించి వారి స్మృతి లోమన చుట్టూ వున్న దీనులకు, వయోవృద్ధులకు, గోవులకు మన శక్తి మేర ప్రత్యక్ష సహాయం చేయాలి.

మహాలయ పక్షము రోజులలో ఒక్క రోజైనా సమీపములో వున్న గోశాలలు దర్శించి గోవులకు గ్రాసమును ఇవ్వాలి. మరణించిన ఆత్మీయులందరినీ తలుచుకుంటూ గోశాలలో కొంత సమయం గడపాలి. ఇదే అసలైన పితృయజ్ఞం.

"పనులన్నీ వదులుకొని చేస్తున్నాను" అనే భావన మరియు ఎలాంటి తొందరా, విసుగూ లేకుండా సంవత్సరానికి ఒక్క రోజు అయినా శ్రద్ధగా పితృ యజ్ఞం ఆచరించాలి. అందువలన ప్రతి క్షణం పితృదేవతల (అంటే మరణించిన ఆత్మీయు లందరి) ఆశీస్సులు పొందుతూనే ఉండవచ్చును.

ప్రతి రోజూ స్నానం చేసి శుభ్రమైన బట్టలు ధరించి శరీరమును కాపాడుకున్నట్లు, మన ఉనికికి, ఉన్నతికి  కారణమైన పూర్వీకుల స్మరణలో సంవత్సరానికి ఒక్క రోజైనా తీరికగా, శ్రద్ధగా వారిని తలచుకొని వీలైతే ప్రతి రోజూ (నిత్య తర్పణం) లేదా సంవత్సరానికి ఒకరోజు (తద్దినం/ శ్రాద్ధం) మరియు మహాలయ పక్షంలో సంవత్సరానికి ఒకరోజు

పితరులందరినీ స్మరించుకొని వారి జ్ఞాపకార్థము గోవులు/ గోశాలలు, దీనులు, వయో వృద్ధులు, అనాధలకు శక్తిమేరా సహాయము చేసి తృప్తి కలిగిస్తే పితృదేవతలు అలా చేసినవారికి నిత్య జీవితాన్ని సుఖవంతము చేసే "దీవెనల రక్షణ కవచం" ఏర్పరుస్తారు.

సనాతనధర్మంలో ఏర్పరచిన ఆచారాలు మన మరియు మన సమాజ ఆరోగ్యం, సౌకర్యముల కొరకే. ధర్మశాస్త్రాలలోని విషయాలు సమాజానికి శాస్త్రీయంగా తెలుపుదాం. పురాణాల కథలలోని అంతరార్థం గ్రహిద్దాం. వర్తమానానికి వర్తించేలా ఋషుల ఆశయం నెరవేర్చుదాం.

ఓం తత్ సత్

**ఆధారపడిన గ్రంథములు:**

షోడశ సంస్కారములు - శ్రీ చివుకుల అప్పయ్య శాస్త్రి
ధర్మసింధు - మోహన్ పబ్లికేషన్స్ ప్రచురణ
ఆపస్తంబ ధర్మ సూత్రం - మోహన్ పబ్లికేషన్స్ ప్రచురణ
యల్లాజీయం - చల్లా లక్ష్మీనరసింహ ప్రెస్, మచిలీపట్నం
యాజూషాపర ప్రయోగానుక్రమణిక - చల్లా లక్ష్మీనరసింహ ప్రెస్, మచిలీపట్నం
గరుడపురాణము - విక్టరీ పబ్లిషర్స్ ప్రచురణ
ఆబ్దిక సర్వస్వమ్ - శ్రీ మార్తి వేంకట్రామ శర్మ
నిత్యకర్మ- పూజా ప్రకాశిక - గోరఖ్ పూర్ ప్రెస్
ఇంటర్నెట్ అన్వేషణతో కొంత సమాచారము

సప్తైతే యజతాం శ్రేష్ఠ! స్వర్గే పితృగణాస్మృతాః
చత్వారో మూర్తిమన్తశ్చ త్రయస్తేషా మమూర్తయః !!

# పితృగణములు

బ్రహ్మ
↓
ప్రజాపతులు
↓
## పితరులు



**అమూర్తులు**
రూపము లేనివారు

**మూర్తిమంతులు**

| వైరాజులు | అగ్నిష్వాత్తులు | బర్హిషదులు | సుకాలులు | భాస్వరులు | సుస్వధులు | సోమపులు |
|---|---|---|---|---|---|---|
| దేవగణములు | | దేవతలు, యక్షులు, గంధర్వులు, రాక్షసులు, నాగులు, సర్పములు, సుపర్ణులు | విప్రగణము (ద్విజులు) | క్షత్రియ గణము | వైశ్య గణము | శూద్ర గణము |
| ఆరాధిస్తాయి | | ఆరాధిస్తారు | ఆరాధిస్తారు | | | |

ఆధారము:
శ్రీ హరివంశ మహాపురాణము
శ్రీ భాష్యకార సిద్ధాంత పీఠము వారి ప్రచురణ

ద్విజ, క్షత్రియ, వైశ్య, శూద్ర గణములు 'వర్ణములు'. నేటి కాలపు 'కులములు' కాదని గమనించాలి.

సాపిండ్యులు | **తండ్రి నుండి క్రమం**

వృద్ధ ప్రపితామహ వృద్ధ పితామహ 7
వృద్ధ ప్రపితామహ ప్రపితామహ 6
వృద్ధ ప్రపితామహ పితామహ 5
వృద్ధ ప్రపితామహ 4
ప్రపితామహ 3
పితామహ 2
పితృ 1



**తల్లి నుండి క్రమం** | సాపిండ్యులు

7. వృద్ధ ప్రపితామహ వృద్ధ పితామహి
6. వృద్ధ ప్రపితామహ ప్రపితామహి
5. వృద్ధ ప్రపితామహ పితామహి
4. వృద్ధ ప్రపితామహి
3. ప్రపితామహి
2. పితామహి
1. మాతృ

**Flow Chart of Genes**
as indicated in ancient sciences




ప్రాచీన శాస్త్రములలో సూచించిన
**జన్యుక్రమము**

సాపిండ్యులు | **తల్లి తండ్రి నుండి క్రమం**

మాతామహ 1
మాతు: పితామహ 2
మాతు: ప్రపితామహ 3
మాతు: వృద్ధ ప్రపితామహ 4
మాతు: వృద్ధ ప్రపితామహ పితామహ 5
మాతు: వృద్ధ ప్రపితామహ ప్రపితామహ 6
మాతు: వృద్ధ ప్రపితామహ వృద్ధ పితామహ



**తల్లి తల్లి నుండి క్రమం** | సాపిండ్యులు

1. మాతామహి,
2. మాతు: పితామహి,
3. మాతు: ప్రపితామహి
4. మాతు: వృద్ధ ప్రపితామహి
5. మాతు: వృద్ధ ప్రపితామహ పితామహి
6. మాతు: వృద్ధ ప్రపితామహ ప్రపితామహి
7. మాతు: వృద్ధ ప్రపితామహ వృద్ధ పితామహి

A gene is the basic physical and functional unit of heredity. Genes are made up of DNA

మానవుల వ్యక్తిగత, సామాజిక జీవనం ఎల్లప్పుడూ ప్రకృతితో సమన్వయం చేసుకుంటూ సాగుతుంటుంది. ప్రాచీన శాస్త్రజ్ఞులు (ఋషులు) లోకకల్యాణం కోసం నిరంతరం అనేక పరిశోధనలు చేసి మన నిత్యజీవనం ప్రకృతితో సమన్వయం చేసుకోవడానికి ఆచరణ యోగ్యమైన ఆచారాలు, సంప్రదాయాలను 'షోడశ సంస్కారాలు'గా రూపొందించి అందించారు.

కాలక్రమంలో చారిత్రక పరిణామాల కారణంగా విదేశీ నాగరికతా వ్యామోహంతో మన ఆచారాలు, సంప్రదాయాలలో ఉన్న శాస్త్రీయతను ఈనాడు గుర్తించలేక పోతున్నాం. సనాతన ధర్మ సూత్రాలను శాస్త్రీయ కోణంలో పునర్దర్శించి నేటి యువతరానికి ముఖ్యముగా బాలలకు వివరించవలసిన అవసరాన్ని గుర్తించి, అందిస్తున్న చిన్న పుస్తకం....

".......తల్లిదండ్రులను, గురువులను, వంశకర్తలను, ఆశ్రితులను, ఆశ్రయమిచ్చిన వారిని, అనాథలను గుర్తించి వారికి తిలోదకాలను ఇవ్వడం పుణ్యకార్యంగా గుర్తించాలి. 'మరణాంతాని వైరాణి' అంటాడు రాముడు. బంధువుల మధ్య వైరభావన ఉన్నా వారికి తర్పణాదులు విడవవలసిందే. పితృదేవతలను స్మరించి వారికి కృతజ్ఞతలు తెలుపుకునే ఉత్సవమిది. "కృత" చేసిన మేలు "జ్ఞ" జ్ఞాపకం "త" విధానం. అంటే చేసిన మంచిని గుర్తించి జ్ఞాపకం చేసుకునే విధానమే కృతజ్ఞతలు తెలుపడం. ఎందుకు స్మరించాలి? అనాదిగా వారిచ్చిన అనుభవ జ్ఞానాన్ని స్వీకరించినందుకు వారిని స్మరించాలి. కృతజ్ఞతలు తెలపకపోవడం కృతఘ్నత అవుతుంది....."

– బ్ర.శ్రీ పాలకుర్తి రామమూర్తి

సనాతనధర్మంలో ఏర్పరచిన ఆచారాలు మన మరియు మన సమాజ ఆరోగ్యం, సౌకర్యముల కొరకే. ధర్మశాస్త్రాలలోని విషయాలు సమాజానికి శాస్త్రీయంగా తెలుపుదాం. పురాణాల కథలలోని అంతరార్థం గ్రహిద్దాం. వర్తమానానికి వర్తించేలా ఋషుల ఆశయం నెరవేర్చుదాం.